# దేశదాసు.



ర చ యి త,

పాతూరి రామకోటయ్య.

# కృతిసమర్పణము.

దేశ స్వాతంత్ర్యమునకై తమ సర్వస్వము ధారవోసి ఆత్మార్పణ మొనరించిన దేశభక్తులకు.

ఇట్లు,

గ్రంథకర్త.

# దేశదాసు.

(ఐదంకముల సాంఘిక నాటకము.)




రచయిత:-

పాతూరి రామకోటయ్య

పేటేరు, రేపల్లె తాలూకా.

(గుంటూరు జిల్లా.)



బ్రహ్మవిద్యా ప్రెస్, రేపల్లె.

1939.

మూల్యము

 ఎనిమిది అణాలు.

# ఉపోద్ఘాతము.

శ్రీయుత ఈడుపుగంటి శివమూర్తిగారు,

(యం. ఎ., యల్. యల్. బి, మద్రాసు హైకోర్టు అడ్వొకేటు)

ఈ గ్రంథమునకు ఉపోద్ఘాతము వ్రాయవలసినదని గ్రంథకర్త శ్రీ పామూరి రామకోటయ్యగారు నన్ను కోరిరి. నాటకమును ఆమూలాగ్రముగ చదువగా నామనము వివిధ భావములకు గురియాయెను. అనేక విషయములు స్మృతిపథమున పరులిడినవి. ప్రాచ్య, పాశ్చాత్యదేశములలో వివిధ వాఙ్మయములందలి ప్రాచీన, ఆధునికనాటకము లనేకములు గుర్తువచ్చినవి. గ్రీకు, లాటిన్, ఆంగ్ల కామిడీలయందుగాని, సంస్కృతాంధ్ర నాటకములయందు గాని వీ రవలంబించిన పద్ధతివంటిది కన్పడలేదు. కొన్ని విషయముల ఆంగ్లదేశములోని షెరిడను, టాంరాబర్ట్సన్ వ్రాసిన నాటకములలో గాని, ఆధునిక ఆంధ్రసాంఘిక నాటకములలోగాని వీరి పద్ధతులకుమూలము కన్పడవచ్చును. కాని, అనేకవిషయముల ఈ గ్రంథకర్తగారవలంబించిన పద్ధతులకు వీరే ప్రథములు. నూతనపథముల చరించి సంపూర్ణస్వేచ్ఛా స్వైరవిహారము సల్పి ఆంధ్రనాటక వాఙ్మయమున తిరుగుబాటొనర్ప సాహసించిన ఈధీరకవిని సహానముతోను, వాత్సల్యముతోను పెద్దలు, విమర్శకులు పరిగణించెదరని తలంచెదను.

గ్రంథకర్త నియమములను పాటించి కొన్ని గ్రంథములను వ్రాసినవారై యుండియు ఈ గ్రంథములోమాత్రం నియమములకు విశేషించి ప్రాధాన్యత నీయదలంచినట్లు కనుపించదు. కథ, కాలము, స్థలము-ఈనాటక నియమములకుగాని, వ్యాకరణ, ఛందశ్శాస్త్ర నియమములకుగాని పూర్తిగా లోబడినట్లు కన్పడదు. గ్రంథకర్త ఉద్దేశ పూర్వకముగానే ఈ నియమోల్లంఘనము చేసియుందురు. నవ్యాంధ్ర సాహిత్యమును నూతన మార్గమున నడపించిరి. కథ పోషణ లేకనే నాటకమును రక్తిగా వ్రాయజూనిరి. అచ్చటచ్చట నియమములతో ఎంతమాత్రము నిమిత్తము లేకనే పాత్రలను పాడించి, పరున్నులెత్తించి ప్రౌఢతను జూపిరి. భారతదేశ సమస్యలన్ని ఒక నాటకములోనే పరిష్కరించదలంచిన ఈ గ్రంథకర్త ప్రయత్నము ప్రశంసనీయము. పోలీసు సబుఇన్‌స్పెక్టరు ప్రేమన్ పశ్చాత్తప్త హృదయుడై దేశదాసుగా మారి దేశభారమంతయు వహించి స్వదేశోద్ధరణకై మూఢదేశాచారముల సంస్కరించ బ్రయత్నించుచు రంగ రంగమున వివిధ సమస్యల నెదుర్కొనుటనుజూడ ఈ గ్రంథమునకు దేశదాసునామ మెంతయు సార్థకమని తోచుచున్నది. నాటకమంతయు దేశకళ్యాణమునకై పనిచేయ కంకణము దాల్చి తన్మయత్వమొందిన దేశదాసుతోనే నిండిపోయినది. ఇతర పాత్రలు వచ్చినంతనే వెడలిపోయెను. దేశదాసు మాత్రం తుది వరకు స్థిరసంకల్పముతో చిదాభాసునివలె వెలుంగుచుండెను. అతని ప్రేమపూరిత పలుకులు విన్నంతనే పతితులు పవిత్రులైరి; త్రాగుబోతులు త్రాగుడు మానిరి; గురు శిష్యులైన

ఆనందశాస్త్రి, శివన్నలు, గ్రామ గణాచారి గోప్యముగ అంతర్ధానమైరి; భక్తులు బలులుమానిరి; హరిజనులు ఆహ్లాదమందిరి; కాపుహృదయమున కులద్వేష మంతరించెను; ధర్మకర్తలమనము ధర్మమార్గముల చరించెను; శాంతాదేవి స్త్రీ ఉద్యమమందు కృషిజేసెను. దేశదాసు ఉపన్యాసముతో నాటకము సంపూర్ణమయ్యెను. హాస్యరసము, త్రాగుబోతుల సంభాషణలలోను, గణాచారి గణములోను, శివన్న శిష్యత్వములోను, గొల్లవాని పాత్రలోను, సాహెబు సానుభూతిలోను. బాగుగా పోషింపబడినవి. పోలీసుల తీవ్రత, జమీందారుల నిరంకుశత్వము, ప్రభుత్వోద్యోగులలో లంచగొండితనము, కొన్ని సాంఘిక మూఢాచారములు సందర్భానుసారముగా విమర్శింపబడినవి. భాష బహు తేలికగాను, సరళముగాను, సరసముగాను, సమయస్ఫూర్తిగాను నడచెను. పద్యములు భావౌన్నత్యము గలిగి రసవత్తరముగ నున్నవి.

ఆంధ్రదేశమున విమర్శ మెండు; అందున తీవ్రతమరెంత. సమర్థులైన సాహిత్యకోవిదుల విమర్శలకు ఈ లేగొమ్మ నిలువలేదు. సానుభూతిగల సత్యాన్వేషణులకిది సంతృప్తి గొలుపకపోదు. ఈ గ్రంథకర్త యుద్దేశ్యము ప్రబోధము; దేశమును పీల్చి పిప్పిచేయుచున్న కొన్ని పాడు ప్రాచీనాచారముల తుదముట్టం జేయుటయే! అందుల కిసుమంతేని ఈ గ్రంథము తోడ్పడిన గ్రంథకర్త పరితృప్తుడగుననియే నాయుద్దేశము. పరమపవిత్రమైన ఈయాదర్శముల కొంతవరకైనను సాధించుటకు ఈ గ్రంథకర్త " దేశదాసు " ద్వారా కృషి

చేసినందులకు మన దేశస్థుల మన్ననలకు పాత్రులగుదురని తలంచెద. దేశమునందు సద్బోధ కలుగజేయుటకు తోడ్పడు గ్రంథము లనేకము లింకను వ్రాయుటకు తగు శక్తి, ధైర్య స్థైర్యములు కల్గుటకు వీరిని పెద్దలు ఆశీర్వదించెదరని యాశించుచున్నాను.

10_9_39. కొడుపుగంటి శివమూర్తి.



# అభిప్రాయము.

ఒకప్పుడు ప్రపంచ విజ్ఞానమునకు మూలమై సర్వ స్వాతంత్ర్యముల ననుభవించుచున్న హిందూదేశము నేడీ శోచ నీయమైన దుస్థితియందుండుటకు ముఖ్యకారణము మన దేశ మందిప్పుడు ప్రబలియున్న మూఢాచారములే! అవి రూపు మాసిపోవలయును. మహాత్ముని జ్ఞానబోధామృతములైన అహింస, శాంతి, ఖద్దరు ధారణలు మనము జీర్ణించుకొన వలయును. ఆనాడే మన దేశమునకు ముక్తి కలుగును. ఈ విషయములనే ఈ గ్రంథమునందు కూర్చి సామాన్య జనుల కైనను సుబోధకమగునట్లు సరళమైన శైలిలో ప్రస్తుతము చాల అవసరమైన ఇటువంటి నాటకమును రచించిన గ్రంథ కర్త, బ్రహ్మశ్రీ పాతూరి రామకోటయ్యగారిని నేనెంతయు అభినందించుచూ ఇంకను వారిట్లు దేశసేవ చేయగలందులకు వలయు అభిమానము దేశస్థులు చూపెదరని నమ్ము చున్నాను.

పెనమకూరు,
10-9-39.

ఇట్లు,
ఈడుపుగంటి రత్నమాంబ.

(శ్రీ వివేకవర్ధనీ గ్రంథనిలయం వారు ఐలవరం.)

మా ప్రార్థన నంగీకరించి, మాకు గురుతుల్యులైన బ్ర॥ శ్రీ॥ పాతూరి రామకోటయ్య కవిగారు, శ్రమయనక ప్రస్తుతకాలమున మన భారతదేశమునగల దురాచారములను మాన్పి సద్బోధదాయకమై యలరారు నీ "దేశదాసు" అను నాటకరాజమును వ్రాసి మాకు నమితానందము చేకూర్చిరి. ఈనాటకము దేశసౌభాగ్యమునకెంతయు తోడ్పడునని తలంచుచున్నాము. మా గ్రంథాలయ సహాయార్థము మిరి పరిశ్రమతో యీ నాటకమును ఒక పర్యాయము ప్రదర్శించితిమి. యీ నాటకముచూచిన ప్రతివారును ఆనందాబ్ధి నోలలాడిరనుటలో నతిశయోక్తి లేదు. గావున యెల్లరును యీ నాటకమును చూచి ఆనందింతురుగాకయనికోరుచూ, యీ కవిగారికి మా గ్రంథాలయముతరఫున అనేకవందనములర్పించుచున్నాము. ఇంకను ఇట్టి గ్రంథములనేకములు యీ కవిగారు వ్రాసి లోకమునకు యిత్తురని యాశించుచున్నాము. యీకవిగారికి ఆయురారోగ్యైశ్వర్యములు నొసంగుగాకయని భగవంతుని ప్రార్థించుచున్నాము.

ఇట్లు,

25—9—39, ఐలవరం.

ఆకురాతి వేంకటరత్నం.
కార్యదర్శి.

కవుతరపు వెంకటరామమూర్తి,
గ్రంథాలయాభిమాని.



శ్రీయుత ఆశుకవిశిఖామణి, భూర్జగురు సార్వభౌమ, నిజానంద,

పోకల వేంకటనరసింహారావు.

మద్రాసు.

తే॥ గీ॥ అయ్య, పాతూరి రామకో ఁ టయ్యగారు
మీరు వ్రాసిన పత్త్రంబు ఁ మేము చూచి
సంతసించితి మొంతయు ఁ సాంఘికంపు
దృశ్యమును నీతులందునఁ ఁ దేజరిల్లు.

తే॥ గీ॥ వ్యాకరణ ఛందములయందు ఁ నష్టమనసు
నుంచకయె నీతులందున ఁ నుంచి దృష్టి
వ్రాసినారలు ధీంద్రుండ ఁ వగుచుదాన
ధీరకవితా విశేషంబు ఁ తేటపడఁగ.

తే॥ గీ॥ దేశదాసను దృశ్యమీ ఁ దేశమునకె
కాక యెల్లెడఁ దన్నీతు ఁ లేకరీతిఁ
బ్రబలి బుద్ధోపదేశమై ఁ పరఁగవిల్లుఁ
గాతమనిశంబు నిదియు దీ ఁ ర్ఘాయువగుచు.

మద్రాసు,
24--10--39.

ఇట్లు,
పోకల వేంకటనరసింహారావు.

పరమహంస పరివ్రాజకాచార్య,

శ్రీ బ్రహ్మానందగిరి స్వామిజీ,

రేపల్లె.

బ్రహ్మశ్రీ పాతూరి రామకోటయ్యగారు 'దేశదాసు' అను నాటకమును వ్రాసి అచ్చొత్తించుటకు మా బ్రహ్మవిద్యా ప్రెస్సునకుఁ దీసికొనివచ్చిరి. అప్పుడీపుస్తకమును సాంతముగఁ జదివితిమి. ఇందుఁ గనుపించు వ్యాకరణ ఛందో దోషములను గూర్చి కవిగారి నడిగితిమి. వారు వానిని బాటించనట్లుగాఁ జెప్పిరి. ప్రస్తుత మీ భారతదేశములో నెదుర్కొనుచున్న నైతిక, ధార్మిక సమస్యలీదృశ్యమునఁ జిత్రింపఁబడి యున్నవి. భారతదేశ మీ కవిగారికిఁ దోడ్పడి ప్రోత్సహించినచో దేశకాల పరిస్థితుల ననుసరించి యిటువంటి సాంఘిక గ్రంథముల నెన్నిఁటినో వ్రాయఁగలరు. ఈ దృశ్య మాదర్శకమై చిరస్థాయిగా నుండుఁగాక!

రేపల్లె,
29-10-39.

ఇట్లు,
S. B. G. Swamiji

బ్రహ్మశ్రీ త్రిపురారిభట్ల వీరరాఘవస్వామిగారు,
సంస్కృత కాలేజి ప్రిన్సిపాల్,
తె నా లి.

ఆర్యా!

నా యభిప్రాయమును గోరి మీరు నా కొసగిన "దేశదాసు" అను నాటకమును జదివితిని. ఇందు దేశక్షేమము దేశ స్వాతంత్ర్యము దేశోన్నత్యము కొరకు శ్రీ గాంధి మహాత్ము డుపదేశించిన సంఘీభావము మద్యపాన నిషేధము, విదేశవస్తు బహిష్కారము, జీవహింసా నివృత్తి, అస్పృశ్యతా నిరాకరణము మొదలైన శాంతియుతోపాయము లెన్నో ప్రదర్శింపబడినవి.

భిన్న భిన్న మానవ ప్రకృతులను భిన్న భిన్న స్వభావములను కవితాశిల్ప సూత్రమున గుదిగుచ్చి రసప్రవాహమున దేలించవలసిన నాటకములకును దీనికిని నిదియే ప్రభేదము. దాస్యవిముక్తి, దేశకల్యాణము, దేశనాగరకత మొదలైన వానిని జిత్రించుటయే ఈ కవి ముఖ్యోద్దేశము. ఇన్ని విషయముల నిందు బొందుపరచుటచే నితని దేశభక్తి వేనోళ్ళ వెల్లడి యగుచున్నది.

ఇందలి భాష సుగమమై పద్యములు సరళములై యెల్లరకు సుబోధమగునట్లున్నవి.

ఇకముందు చక్కని గ్రంథములు పెక్కులు రచించి చిరకాలము ఆంధ్ర మాతృసేవ చేయునట్లు ఈ కవిని పరమేశ్వరు డనుగ్రహించుగాక!

తెనాలి,
7-10-39

ఇట్లు,
త్రిపురారిభట్ల వీరరాఘవస్వామి.

కవి, జోశి,

బ్రహ్మశ్రీ కూచిభొట్ల ప్రభాకరశాస్త్రిగారు,

కొల్లూరు.

ఈ సాంఘిక నాటకము రచించిన శ్రీ పాతూరి రామకోటయ్యగారు నాకు చిరపరిచితులు. వీరు వ్రాసిన పద్యములు, నాకనేకమారులు వినిపించినారు. కవికి కుంటువడని ధారవున్నది. పద్యము చక్కగా నడచును. వీరికి నాటకములు వ్రాయుట సరదా... అని వీరి పుస్తకములవల్ల తెలసుకొంటిని. పద్యముకూడా కొంత రాగధోరణిలో, చదువుతూ వుండేవారు.

ఈ "దేశదాసు" అను నాటకమచ్చు పూర్తి అయిన తదుపరి నాకు చూపించినారు. స్థాలీపులాకన్యాయముగా నీ పుస్తకము చదివినాను. కవికి దేశభక్తి మెండు. సనాతనాధునాతనాచారములలో కొన్నింటియం దాసక్తి, కొన్నిటియందు ద్వేషము వున్నట్లు తోచినది. కాని అభిప్రాయములు బాగుగా వెల్లడించినారు.

కవిగారి, కవితా విషయముగూర్చి వ్రాయదలంచితిగాని, వారి విజ్ఞప్తిలో విజ్ఞాపనము చేసియున్నారు.

నా మిత్రులు శ్రీ త్రిపురారిభట్ల వీరరాఘవస్వామిగారు వ్రాసిన అభిప్రాయములతో నేకీభవించుచు; దేశభక్తులు, సాంఘిక నాటకాభిమానులు, యీ నాటకమును ఆదరింతురని నమ్ముచున్నాను.

కొల్లూరు,
7-10-39.

ఇట్లు,
కూచిభొట్ల ప్రభాకరశాస్త్రి.

# J. MADHAVA RAMA SARMA GARU,

Sahitya Vidya Praveena Lect. Sahitya Alankara
History of Sanskrit Language and Litarature,
Vice-principal Sanscrit College, TENALI.


భారతదేశ వాఙ్మయములో కావ్యరూపాన విప్లవము బయలుదేరి కొన్నివందలసంవత్సరములైనది. ఇదివరలో మత, సంఘ, దేవ, వేద, సంప్రదాయాలపై విప్లవధర్మమును నిర్ణయించిన కావ్యాలు అధికముగా కన్పడవు నవీనకాలంలో దైవికారాధనముకూడా విప్లవ ధర్మాలతో కూడుకొనవలసిన దుర్గతి సంప్రాప్తమైనది. ఒకేలక్ష్యమును సంపాదించటానికి తత్వదృష్టిలో విప్లవముఅవసరముకాదు. దేనినో లక్ష్యముగా పెట్టుకొని అవాంతరసిద్ధులనుకూడా తమ లక్ష్యమార్గంలో కలపవలెనని అభిప్రాయముతో మానవుడు విప్లవమును అనుసరించుతాడు కాంగ్రెసుపేరుతో అనేకులు ప్రకృతము విప్లవమును ఆరాధించుచున్నారు. వారిలో రామకోటయ్యగారు ఒకరు, దేవాలయప్రవేశము, సంస్కరణ, మొదలగుకొన్ని ధర్మాలనుకూడా దైవారాధన ప్రణాళికలో కాంగ్రెసుచేర్చింది. వాటినివిమర్శింపను. ఈకవి ఆమార్గమునే అనుసరించినారు. షద్దోవిధమున ఆర్యధర్మములలో, లోటునుచూపుట పరిపాటి అయినది. హిందీవాఙ్మయమునందు ఇట్టిరచనలుఉన్నవి. కావ్యవిప్లవము చిరకాలము ఉండవలసిన అవసరములేదు. తాత్కాలిక సముద్రకముతో బయలుదేరిన గ్రంథము తత్సమయ ప్రయోజనమును మాత్రము సంపాదింపగలదు. ఈ గ్రంథము విప్లవరూపమున ఎత్తిచూపిన విషయములపై కవితలచిన ప్రయోజనములను పాఠకులకు కలుగచేయకపోదు. మద్యనిషేధము, ఖద్దరుసముత్పత్తి, అజ్ఞాననిర్మూలనము, గ్రంథా

లయస్థాపనము, మొదలగువిషయములలో నే నైకమత్యము ప్రదర్శింపగలను. ఈనాటకము విషయప్రధానకము. కవి తానుతలచినభావములను తెలియచేయుటలో మృదుశయ్యను స్వీకరించినాడు. ఈ రామకోటయ్యగారి రచన ధర్మారాధనకు సమర్థమగునదిగా నుండునట్లు చేయవలయునని పరశివునిప్రార్థించెదను.

తెనాలి,
ది. 8-10-39.

ఇట్లు,
జమ్ములమడకమాధవరామశర్మ.

చల్లా వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రి,
తె. తా. గ్రంథాలయ ఉపాధ్యక్షుడు.

బ్రహ్మశ్రీ పాతూరి రామకోటయ్యగారిచే రచింపబడిన ఈ "దేశదాసు" అను నాటకమును సమగ్రముగా చదివి చూచితిని. రచయిత కడు నేర్పుకలవారు. కథయందు ప్రస్తుతకాల పరిస్థితులన్నియు చొప్పించినారు. కథ నూతనముగాయున్నది. ఇందలి పద్యములు, రసవంతములై భావప్రధానములైయున్నవి. వీరిట్లే సరసములగు నూతన భావములతో మరికొన్ని గ్రంథముల రచించుదురుగాక యని ఆశించుచున్నాను.

పేటేరు,
25-9-39.

ఇట్లు,
చల్లా వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రి,

# విజ్ఞప్తి.

ఈ దేశదాసు అను అయిదంకముల సాంఘిక నాటకమును నామిత్రుల ప్రోత్సాహముతో రచియించి తిని. ఇందు, ఉద్యోగపిపాస, త్రాగుడు, జీవహింస, మత ద్వేషములు, అంటరానితనము జమీందారీ కార్మిక కర్షక సమస్య, మూఢాచారములు, లంచగొండితనము, మొద లగు విషయములను చర్చించి తొలగించు ప్రయత్నము లున్నా, దేశముయొక్క ఔన్నత్యమునకును, విశ్వమానవ కల్యాణమునకును నావశ్యకమైన, దేశసేవ, ఖద్దరుప్రాము ఖ్యత, గ్రంథాలయముల యావశ్యకత, భారత సోదరసోదరీ మణులముఖ్యకర్తవ్యములను సూచించుటయున్నా నా యభి ప్రాయమైయున్నది. నాటకనియమములు, ఛందోవ్యాకరణ ములు పాటించి కొన్నిగ్రంథములు యిదివరలో వ్రాసినవాడ నైయున్నను, ఇందు నాయాం యంశములను అంతగా పాటింప లేదు. భావప్రకటనము, అందఱికిని చక్కగ దెలియునట్టిభాష, ప్రస్తుత కాలమున ముఖ్యావసరమనియు నా యభిమతము. ఈనాటకము సర్వ జనోపయుక్తమగునని యాశించుచున్నా ను. పండితుల విమర్శనలకు నీ గ్రంథము నిలువలేదు. ఇం దులకుబుధవర్యులు సహింతురుగాక. యీ నాటకమునువ్రా యుటలో, చి॥ నిరాఘాటం కుమారస్వామి ఇచ్చుచు వచ్చిన సలహాలను వాత్సల్యంతో అంగీకరించుచూ యీతనిభావో

స్వత్వమునకు సంతసించితిని. యీ నాటకము వ్రాయుటకు ముఖ్య కారకులైన ఏలవరం శ్రీవివేకవర్ధనీగ్రంథ నిలయము వారికిని, ప్రోత్సహించినమిత్రులకును, యీ గ్రంథమునునా మూలాగ్రముగ చదివి తమ ఉపోద్ఘాతములు అభిప్రాయములు వ్రాసి యిచ్చిన విబుధులకు నా అభివాదనములర్పించుచూ దేశాభిమానులెల్లరును యీ గ్రంథము నాదరింతురనియు, నాటకరంగమున ప్రదర్శించుటకు వీలైన ఈ నాటకమును నటకశిఖామణులు సర్వదా ప్రదర్శించి నాకు నాత్మానందము గూర్తురనియు కోరుచూ నిరంతరము మన దేశమునకు సర్వశ్రేయములు నొనగూర్ప భగవంతుని ప్రార్థించుచున్నాను.

పేటేరు,
24—9—39.

ఇట్లు,
గ్రంథకర్త



# పాత్రలు.

పురుషులు:—

ప్రేమున్ (సబ్ యిన్‌స్పెక్టరు) = దేశదాసు.
రాంపాతులు, జయశర్మ, కాంగ్రెసు నాయకులు
కృష్ణారావు, శ్రీరామశాస్త్రి, వాలంటీర్లు.
1, 2, 3 త్రాగుబోతులు.
ఆనందశాస్త్రి:-గురువు.
శివన్న:-శిష్యుడు.
గొల్లవాడు.
కణాచారి.
1, 2 భక్తులు.
హరిజనుడు.
కాపు.
సూరయ్య. పూజారి.
ధర్మకర్త.
సాహేబు.
వకీలుశాస్త్రి.

స్త్రీలు:—

శాంతాదేవి.
1, 2, విధవాస్త్రీలు.

# దేశదాసు.

## ప్రథమాంకము

### పరీక్షమరంగము.

(ప్రేమన్ సబ్ ఇన్‌స్పెక్టరు ప్రవేశము పేపరుచదువుచు.)

"వందలకొలది వాలంటీర్లు కల్లు సారాయి మొదలగు మత్తుపదార్థముల నమ్ము దుకాణములవద్ద పికెటింగులు చేయుచుండ, పోలీసువారు లాఠీచార్జీచేసి పెక్కుమంది వాలంటీర్లను అరెస్టుచేసిరి. ఇంకను పట్టుదల వీడక స్త్రీలు సహితము సత్యశీలాదేవినాయకత్వమునవలంటీర్లలో జేరిమత్తుపదార్థముల సేవించు నాసక్తిచే వచ్చువారలను వారించుటకు ప్రయత్నించుచున్నారు. న్యాయాన్యాయ విచక్షణలేక నీ పోలీసువారు పెట్టుచున్నబాధలు తలంచిన మెంతయు ఘోరముగనున్నవి."

(పేపరుచదువుటనాపి) అవును! ఇందు సందేహ మెంతమాత్రమునులేదు. పాపము పోలీసువారికి దమ విధ్యుక్తధర్మమున ప్రవర్తింపక వీలులేనందున నెంతటి దురంతముల నైనను చేయవలసినదే. నా యనుభవమునుబట్టి విచారించిన భారతీయుడై జన్మించిన వ్యక్తికి నాచరింపరాని దుర్మార్గపుపనుల నెన్నిటినో యాచరించితిని. నా సహోదరి సత్యశీలాదేవి ప్రవర్తనతో నన్నుబోల్చి చూచుకొనిన హస్తిమశకాంతర తారతమ్యముకలదు. పాపము ! సుకుమారి. దేశక్షేమముకొ

ఱకు ఎన్నెన్ని పడరాని యిక్కట్లు బడుచున్నది! తలంచిన కొలదియు నామనంబునకు శాంతి కుదురుటలేదు. వేతనముల కాసించి నెత్తురుకూటి యుద్యోగమున బ్రవేశించి ఎంతటి దేశ ద్రోహినగుచున్నానోకదా? హిందువులకు నుద్యోగము లిచ్చినట్లు నటించుచూ వారిచేతనే హిందువులను బాధింప జేసి స్వేచ్ఛగ రాజ్యపాలనము సాగించుచున్న గవర్నమెంటు వారి యోచన ప్రశంసాపాత్రము. ఇతర యుద్యోగములకును యీ పోలీసు యుద్యోగములకును చాల వ్యత్యాసముకలదు. త్రాగుడు, జారత్వము, లంచగొండితనము మొదలగు దుర్వృత్తులు ఎంతటి ఆచార సంపన్నునకైన నతి సులభముగ నల వాటుపడును. పాపభీతికి తావులేదు. ఛీ! ఈ యుద్యోగము చేయుటకన్న మిన్నకుండుట మేలని తోచుచున్నది. ఉద్యోగ పిశాచముచే పీడింపబడుచున్న నాకు, దేశసోదరుల దుస్థితులు పొడగట్టుచుండుటలేదు. కొలదిరోజులక్రింద నొక కాంగ్రెసు నాయకుడు తన ఉపన్యాసమునకు ముందు ప్రేక్షకులతో,

సీ॥ పదవులనాసించి పరదాస్యముల జేయ
నేగెడు సకల యుద్యోగులార!
మతద్వేషముల్పెంచి సతతంబుగలహింప
గోరుచుండినయట్టి గురువులార!
మద్యపానముజేసి మర్యాదబోనాడి
రోతబట్టెడు త్రాగుబోతులార!
జాతరల్ సృష్టించి జంతుకోటినిజంపి
హాయిగా దినెడు శాకేయులార!

తే॥ గీ॥ జ్ఞానమనుమాటలేక నజ్ఞానులయ్యు
భరతమాతను గష్టాల బడగద్రోచి
తుచ్ఛసుఖముల నాసింప దోసగుగాదె
జన్మభూమిని సేవించు జాడగనుడి.

అని చెప్పెను. అప్పటినుండియు నామనంబున నేత ద్విషయములనుగూర్చి చర్చించి తుదకు యదార్థములని నేటికి గ్రహింపగలుగుచున్నాను. యింక తడవుసేయక దేశసేవ యందే పవిత్రమగు కాలమును గడపుట శ్రేయస్కరమని తోచుచున్నది. కావున యిప్పుడే నా యుద్యోగమునకు రాజీనామా నిచ్చెదను.

[నిష్క్రమించును.]

---

## 2-వ రంగము.

కాంగ్రెసు వాలంటీర్లు జెండాలను పట్టుకొని కీర్తనలతో
[ప్రవేశించుదురు] భరతమాతకు జై!

1. వా:-సోదరా! మనకర్తవ్యమేమి ?

2. వా:-ఏమికలదు.

తే॥ గీ॥ సత్య దీక్షను వహియించి సర్వజీవ
కోటినెల్లను దనయాత్మ సాటిగాగ
జూచి ప్రేమించు మనగాంధి జూపినట్టి
మార్గమందున వర్తించి మనుట శుభము.

1. వా:-అగును. నిజమే. గానియింతవఱకు జస్టిస్‌పార్టీయం దుండిన మన సోదరులుకూడ కాంగ్రెసు యుద్యమమున ప్రవేశించి వేరు వేరు మార్గముల అభిప్రాయము లిచ్చు చున్నారు.

2. వా:-మహాత్ముని అభిప్రాయములకు వ్యతిరేకముగ ప్రవ ర్తించుటకు ఎట్టి వారికి సాధ్యముకాదని నమ్మెదము. కాం గ్రెసు మెంబర్లమని పేరుపెట్టుకొని వ్యతిరేక భావములతో ప్రవర్తించువారి యుద్దేశ్యములు మార్పుజెంది మహాత్ముని యాజ్ఞలకు బద్ధులగుదురు. ఇందు సందేహ మెంతమా త్రమును లేదు.

1. వా:-కావచ్చునుగాని కొంతవఱకు దేశమున అల్లరి జరుగు నని అభిప్రాయపడుచున్నాను.

2. వా:-తొందరపడిన ప్రయోజనము లేదు. యీ విషయము లను చర్చించుటమాని త్వరలో మన సోదరనాయకులతో సినాడు సమావేశమగుటకు నిశ్చయించుకొనిన ప్రదేశము జేరుకొందము రమ్ము. (నిష్క్రమించుచుండ కీర్తనతో ప్రేమన్ ప్రవేశించి) ఓమహనీయులారా! ఆగుడు; ఆగుడు. నేనును తమతో వచ్చెదను.

1. వా:-ఓహో! సబ్ ఇన్‌స్పెక్టరుగారా! ఇదేమిటి! యిలా బయలుదేరారు? పూర్తిగా మారిపోయారే ... ...

2. వా:-తమ యుద్యోగమును వదలుకొంటిరా?

ప్రే:-అగును. మానుకొంటిని.

1. వా:-మీా చేతులతో మన్ముల నిన్నటివరకు బోధలు పెట్టి యుద్యోగమే స్థిరమనినమ్మిన మీారు నేడు యీావిధముగ మనస్సును మార్చుకొని దేశసేవకు గడంగిన మీా త్యాగశీలము కొనియాడదగినదే.

2. వా:-అయ్యా! మీా యుద్యోగమున నేమైన గష్టములు గలిగినవా?

ప్రే:-నాకట్టి కష్టములును గలుగలేదు. కాని యీాయుద్యోగపిపాసచే నే నొనరించుచున్న దేశద్రోహమును బాగుగ తెలిసికొని జ్ఞానమువచ్చి దేశసేవ చేయవలెనని తలంచితిని.

1. వా:-మీా ఉద్యోగమే మిమ్ముల నట్టికార్యములు చేయించినది కాని మీా పొరపాటులేదు. అయినను మీారు దేశద్రోహులనిపించుకొనుటకు హేతువేమైన కలదా?

ప్రే:-ఒక్కటికాదు, లెక్కలేనన్ని కారణములు కలవు. చెప్ప సాధ్యముకాకున్నది. నేనొనర్చిన పాపఫలము నన్నేనాటికినైన బాధింపకపోదు. ఇంతటనైనను సన్మార్గమున వర్తించుట శ్రేయమని యూహించి దేశసేవకు గడంగితిని.

2. వా:- అయ్యా! తమ ప్రయత్నము లోకకళ్యాణమునకు తోడ్పడునుగాక.

1. వా:-సరియే. ఇంక మనము త్వరితముగబోయి మన సోదర నాయకులను గలసుకొందమురండు. అచ్చట మీాయుదత

తము నెల్లరకు విశదపరచి మీకు సహాయ మొనర్తుము. రండు పోవుదము.

ప్రే:-అటులనే నడువుడు.

(కాంగ్రెసు వాలంటీర్లు కీర్తనతో నిష్క్రమింతురు.)

---

తృ తీ య ర ం గ ము.

రాంపంతులు, జయశర్మ అను యిరువురు నాయకులు ప్రవేశము.

పం:-ఇంకను మన కృష్ణారావు, శాస్త్రిగార్లు రానికారణ మేమి ?

జయ:-వారు రాలేదు వీరురాలేదు అనుకొనుట తోడనే కాల మంతయు గడచుచున్నది.

తే॥ గీ॥ కాలమంతయు నిట్టులే గడచుచుండ
మనదుకార్యాలు నెరవేర్ప వలనుపడునె ?
ఎవరువచ్చిన రాకున్న నేడుమనము
నుప్పుచేయంగ దరలుటే నొప్పునయ్య.

పం:-తొందరపడక అందరితో గలసియే పోవుటమంచిది.

(తెరలో కీర్తనలు వినబడును.)

అదిగో! మాటలోనే మన వాలంటీర్లు వచ్చుచున్నారు.

(వాలంటీర్లు ప్రవేశింతురు.)

పం:-ఆలస్యమునకు గారణమేమి ?

1. వా:- మేము వచ్చుచుండ నీ ప్రేమన్‌గారు మమ్ము గలసుకొనిరి. అంతట వీరి యుదంతము నెఱుంగగోరితిమి.

పం:- ఏమి చెప్పిరి?

2. వా:- తమ యుద్యోగమునకు రాజీనామానిచ్చి దేశసేవకు గడంగితిమని నుడివిరి. అంతట మేము సంతసించి వెంట నిడుకొని వచ్చుచుంటిమి.

ప్రే:- అయ్యా! యింతకుపూర్వము ఉద్యోగముచే మత్తెక్కి యున్న యీయూఖునకు మహాత్ముడగు గాంధిజీ యొక్క సిద్ధాంతములు అర్థము కాలేదు. కాబట్టి ఒక్కమారు తాము తెలుపసంగెదరని ప్రార్థించుచున్నాను.

పం:- అటులైన జెప్పెద వినుము. మద్యపానమును నిషేధించుట, జీవహింసను బాపుట, దేశదారిద్ర్యమును బాపు ఖద్దరు నుత్పత్తిచేసి సర్వులు ధరించుటకు ప్రోత్సహించుట, విదేశవస్తు సామగ్రులను బహిష్కరించి స్వదేశవస్తువులను వాడుకొనునట్లు చేయుట, బాల బాలికలకు వృత్తివిద్యలను చెప్పించుట, నిరక్షరాస్యతను తొలగించుట, కోర్టులకు నెక్కకయే వ్యవహారములు పెద్దలవలన బరిష్కరించుకొనుట, మతకలహములను రూపుమాపి హిందూసంఘమును వృద్ధిజేయుట మొదలగు సిద్ధాంతము లెన్నియో గలవు. అన్నింటిని గ్రమముగ నాచరణలోనికి దేవలయును.

ప్రే:- అయ్యా! తాము నుడివినట్లు ఇంక ననేకములగు లోపములు మనలో నున్నవనుటకు సందియములేదు. దేశ

వాసులలో చాలభాగము మాధ్యమున నుండుటచే యీ మన సిద్ధాంతములను త్వరితముగ గుర్తెఱుంగలేరు సరి కదా! మనలను అనేక యిబ్బందులను పెట్టుదురేమో యని సందేహము కలుగుచున్నది.

పం:-అయ్యా! ఎన్ని కష్టము లావహిల్లినను, గార్యదీక్ష వదలక శాంతియుతులమై మానవసోదరులకు యీ సిద్ధాంతములను నచ్చజెప్పి దేశమునకు శ్రేయము కలిగింపవలెను. యీ కార్యము ఒక్కనాటితో పూర్తియగునదికాదు. జీవితములుసహా ధారపోయవలయును. ఇప్పటికే చాల ఆలస్యమైనది. తొందఱగా మన భవిష్యత్కార్యమగు ఉప్పు సత్యాగ్రహమునకై మన వాలంటీర్ సోదరులను గలసుకొందమురండు. మరచితిని! నిన్నింతటినుండియు దేశదాసనునామమున బిలచుచుందుము. నీ త్యాగశీలము మహాత్ముని యాశీర్వచనా ప్రభావమున స్థిరంబుగనుండుగాక.

ప్రే:-ధన్యోస్మి.

పం:-సరియే ముందు నడువుడు.

[నిష్క్రమింతురు.]

పం:-ఆహా! భారతసోదరుల కెల్లరకు నిట్టి మహదాశయము లున్నచో మాకార్యము ఫలించుటకు అభ్యంతరము లేదు. అట్టిభాగ్య మింకను గలుగనందులకు చింతింపవలసియున్నది. ఓ భారత సోదర సోదరీ మణులారా! ఎన్నాళ్ళు

యీ విధమున కాళ్ళు ముడుచుకొని యిండ్లలో నుండ దరు. రండు. బయటికిరండు. దేశక్షేమముకొఱకు మీ సర్వస్వమును ధారవోసి స్వాతంత్ర్యసిద్ధులై హాయిగ కాల ముగడపుడు. స్వాతంత్ర్య సమరమునకై ఏర్పాటు చేయబడిన స్వారాజ్యరథమును నడపించుటకు ఎల్లరునునడుముగట్టుడు. యీరథము సామాన్యమైనదని యూహింపకుడు.

సీ॥ రాట్నంపుచక్రమే రథచక్రమునుగాగ
నడచుచున్నట్టి దీనాటి రథము
శాంతిధర్మంబు లాశాంతంబులనుజుట్టి
వచ్చు గుఱ్ఱంబులై వరలురథము
నాల్గువేదాలనునట్టి సూత్రంబులే
పగ్గంబులైధర బఱగురథము
ఆత్మస్వాతంత్ర్యంబె ఆకారధారియై
పుడమిపైదిరుగాడు పూజ్యరథము

తే॥ గీ॥ అలవలంటీర్లు సేవకులైనటింప
కామజనకుని రూపుడౌ గాంధియెక్కి
శాంతిసమరముసేయగా సాగురథము
ముందుసేవింపవేరారె యాందముగను.

నాయనా! రమ్ము పోవుదము [నిష్క్రమింతురు.]

## చ తు ర్థ రం గ ము

[కల్లు అంగడియందు ఇరువురు త్రాగుబోతులు తప్పత్రాగి కీర్తనతో ప్రవేశము.]

1. త్రా:-త్రాగితేరప్పా సారాత్రాగాలి. టెంకే పీకు లేటినాలి త్రాగితే త్రాగినోడంటారుకాని, చుక్కాచుక్క త్రాగితే యేంచేశారు? యేడిచారా!

2. త్రా:-ఒరే బావా। నీకోమాట చెప్తాయినను.

1. త్రా:-ఏంమాటో చెప్పు. [త్రాగుచుండును.]

2. త్రా:-షరేకాని షంద్రానికస్తే పాట లినబడతాయ్ పోదాం.

1. త్రా:-నేను పాడానాంటే నెమిళ్ళు లోకలిప్పుకాడాల్సిందే

2. త్రా:-ఒలేపాటగాడివిలే! ఏదిరా పాడు. పాడరా పాడు.

1. త్రా:-కూషో పాడ్తా.

[యిరువురు కూర్చొని పాటలు పాడుదురు.]

2. త్రా:-ఒరేబావా! యిందాకటి చిల్లరడబ్బు యేంచేశావ్.

1. త్రా:-మాట్లాడితే నోటికి బుద్ధిచెప్పిస్తా.

2. త్రా:-నీఅబ్బకు బాకీ వుండాననుకున్నావా!

1. త్రా:-ఏఁయ్ జాగ్రత్త. డొక్క చింటుటా.

2. త్రా:-టంటాషూడు [ఇరువురు కలబడి పోట్లాడుచుందురు.

(దేశదాసు ప్రవేశించి ఇరువురను విడదీసి)

దే:-సోదరులారా! ఏల మీరిట్లు దెబ్బలాడెదరు?

1. త్రా:-అరే పోవోయ్ అవటలికి.

దే:-ఆహా! ఏమి యీరీతియున్నది? [త్రాగుబోతులను చూచి] ఓ యన్నలారా! మద్యపానాసక్తులై భార్యాపుత్రాదులను తల్లిదండ్రులను సోదరసోదరీమణులను ఇల్లువాకిళ్లను మంచిచెడుగులను మఱచి లెక్కకుమిక్కిలి ధనవ్యయము చేసి తుదకు బైరాగులై యేల సంచరించెదరు? భారతమాతయొక్క దైన్యమును గన్నులార గాంచినచో నెంతటి దుర్మార్గుడైనను మనసు కరుగకపోదు. అట్టిచో మీరేల నింత కఠినహృదయులై మాతృదేవతాపరాధ మొనర్చెదరు? మద్యమునువీడిరండు. నడుముకట్టుకొని భారతమాతను సేవింపుడు. ఏమీ! నా మాటలు మీ చెవినిబడుటలేదా! రాత్రింబవళ్ళు మద్యరసముననే మునింగి తేలుచున్నచో ముందు మనగతియేమి? ఒక్కమారు కన్నులతెఱచి లోకమునుగాంచుడు. తడయక నామాటల నాలకించి కార్యరంగమున బ్రవేశింపుడు. [కీర్తన]

సోదరులారా! మనదేశ మెంతటిదైన్యమును బొందుచున్నదో చెప్పనేల?

సీ॥ పంటలన్నియుబోయి పన్నుగట్టగలేక
యాసాములెక్కడ నార్చుచుండ
జేతిపనులను జేసి జీవించువారలే
మిషనుమిల్లులురాగ బిట్టునేడ్వ
మనదేశవాణిజ్య మడుగంటిపోవగా
సతము వర్తకకోటి వెతలగుంద

రతనముల్ బంగారు నితరదేశముజేఱ
భారతావని యెంతో బావురనగ
తే॥ గీ॥ నెంత కఠినున కైన నావంతయేని
జాలిబుట్టకపోదు నిజంబుగాను
పుడమితల్లికి గన్నీరు దుడువనేడు
కల్లువిడనాడి వేవేగ గదలిరండు.

అయ్యో! నీచమైన యీమద్యపానముజేయు నాసక్తి మీకెట్లు కలిగినది. దీనిని సేవించి యెందఱెంద అధోగతి పాలైరో విని, కని, యెఱుంగరా?

సీ॥ భూములనమ్మించి బొచ్చె జేతికినిచ్చి
యిల్లిల్లుద్రిప్పు నీ కల్లుసార
కులగోత్రములబాపి కొంపలనమ్మించి
కడునీచునింజేయు గల్లుసార
భార్యబిడ్డలనైన బల్మిమై జంపించి
కడగండ్లబడద్రోయు గల్లుసార
ద్రవ్యలోపముచేత ద్రాగమానెదమన్న
గలవరపెట్టు నీకల్లుసార
తే॥ గీ॥ ఉచ్చనీచముతెఱుగక నూరురోయ
గుక్కరీతిని వీధుల గొందులందు
నేల బొర్లాడజేయును ఇంతయేల
గడకు ప్రాణాలదీయు నీకల్లుసార.

అయ్యయ్యో పెనుభూతమువలె మీకు నీ కల్లుసారాయి యెక్కడ దాపరించినది?

1. త్రా:-కాంగ్రెషువారు కల్లుసారామజా టెల్వక మాట్లాడే మాటలు విన్నావట్రా బావా; [దేశదాసునిచూచి] ఒరే వాలంటీరూ! కాష్ట సారాట్రాగి షూడరా. షొర్గం కనబడలా టమాషా!

దేశ:-ఓమధ్యరసమా! నీ యద్వితీయమైనశక్తి వర్ణనాతీతము కదా. నిరుపేదలు సహితము కాయకష్టముజేసి యార్జించు ద్రవ్యము దమ యాలుబిడ్డల పోషణార్థమునకు మాలుగ నీకై వెచ్చించి కొలుమాలిన నిన్ను సేవించుచుండిరికదా! ఎంతటికైనను నీవే సమర్థవు.

సీ॥ దీవులు సంద్రాలు దివ్యంబుగాదాటి
ఆరువేలైళ్లొచ్చి యాగినావు
అతిపూత చరితమైనట్టి యార్యావర్త
భూమినిగాలోన్మెప బూనినావు
నానాట స్థిరపడి యేనాడుమెలుగని
శిష్టులిండ్లను బ్రవేశించినావు
స్త్రీల బురుషులగూడ లీలనీదాస్యంబు
జేయగా మాయను జేసినావు

తే॥ గీ॥ మంచియిండ్లకు నిప్పు నంటించినావు
పెక్కు సంసారముల రోతబెట్టినావు
యెన్నొ హత్యలు భువిని జేయించినావు
మఱల నింకేమిజేతువో మద్యరసము.

3. త్రా:-[ప్రవేశించి] సత్యము. సత్యము. మహానుభావా! సత్యము. అజ్ఞానతిమిరంబునంబడి యధోగతిపలుగానున్న

యీ మూర్ఖుని మన్నింప వేడుచున్నాను [కాళ్ళపైపడును.]

దే:-సోదరా! లెమ్ము [లేవనెత్తి] భయపడక నీయుదంతమును చెప్పుము.

3. త్రా:-అయ్యా! కన్నను మిన్నను గానక నహర్నిశలు మద్యపానాసక్తుడనై ద్రవ్యము నంతయు వెచ్చించి భార్యబిడ్డలను పోషించుటకు సహితము చేత నరకాసైనను లేక నష్టములనో వారిని విడచి తప్పించుకొని దేశద్రిమ్మరినై వచ్చునాకు నింకను నీమద్యముమీదియాస వదలకున్నది. కూలిచేసి తెచ్చిన స్వల్పద్రవ్యమును యీనాడు త్రాగుటకై వెచ్చింపవచ్చితిని. ఇచ్చట పరమపురుషులరైన తమ దర్శనభాగ్యము లభించినది. యింతకుమున్న నీ త్రాగుబోతులనుగూర్చి తమరు యుపదేశించిన వాక్యములన్నియును యథార్థములని నాయనుభవమువలన నేటికి తెలిసికొనగలిగితిని. ఇట్టి నాకు దమ మృదుమధురవాక్యములు తారకమంత్రమై విరాజిల్లుచున్నవి. మీ పాదములాన నేటినుండియు మద్యమును త్రాగుటమాని దేశసేవకుండనై వర్తించెదను. నన్ననుగ్రహింపుము.

దేశ:-నాయనా! నీమాటలు నా హృదయమునకు నొకింత శాంతినిగూర్చుచున్నవి. గావున నేటినుండియు మహాత్ముని యాజ్ఞానుసారము ప్రజాసేవ నొనర్చి తరించుము. రమ్ము పోవుదము.

3. త్రా:-చిత్తము. [నిష్క్రమింతురు.] [తెఱవ్రాలును.]

# ద్వితీయాంకము

## 1-వ, రంగము.

రామపంతులు, జయశర్మ, దేశదాసు ప్రవేశము.

రాం:-దాసుగారూ! అద్వితీయమగు తమ దేశసేవాపారీణత యెంతయు గొనియాడదగియున్నది.

దేశ:-తమకు నాయందుగల వాత్సల్యతచే నిట్లనుచుంటిరి గాని వాస్తవముగ నట్టి సామర్థ్యము నాయందు లేదు.

జయ:-అయ్యా! మీదటి కర్తవ్యమును గూర్చి యోచింతమా?

రాం:-దేశసోదరులు మన ప్రయత్నమునకు సంపూర్ణముగ దోడ్పడుచున్నట్లు గాన్పించుటలేదు.

దేశ:-అగును. ఇందు ననేక భేదభావము లేర్పడుచున్నవి.

జయ:-భేదభావములకు హేతువేమి?

రాం:-అనేక కారణములున్నవి. ముఖ్యముగ నొక్క విషయమును గూర్చి ఆందోళన జరుగుచున్నది. ఎట్లంటివేని వినుడు. మనదేశమున వేర్వేరు రాష్ట్రములుండుటచే నొక రాష్ట్రములోనివార లితరరాష్ట్రములో ఉద్యోగములకు గాని, యితర వృత్తులకుగాని పాల్పడుటయు, నందులకు రాష్ట్రప్రభుత్వములు అంగీకరించుటయు పనికిరాదనియు, ప్రతిరాష్ట్రమునందును, విద్యాధికులు, వ్యాపారజీవనులు కలిగియున్నందున యేరాష్ట్రమువారికి ఆరాష్ట్రములోనే

ఉద్యోగములు వృత్తులు కల్పింపవలెననియు, ప్రజలు ఆందోళనము చేయుచున్నారు. యింకను కొన్ని రాష్ట్రములవారల సమ్మతిని తెలుపుచున్నారు.

జయ:-అగును. ఆమాటయును నిజమే ఏలనన, అధిక వేతనములనిచ్చి అన్యరాష్ట్రీయులను ఉద్యోగములలో నియమించుటకన్న, తక్కువ వేతనములకు పనిచేయు సమర్థులైన స్వరాష్ట్రీయులనే నియోగించుట శ్రేష్ఠమని తోచుచున్నది.

దేశ:-ప్రజలచే నెన్నుకొనబడిన రాష్ట్రప్రభుత్వములు ఎన్నటికిని వ్యతిరేకముగ సంచరింపరు. ప్రజల అభిప్రాయములలోని మంచిచెడుగులను, లాభనష్టములను విచారించు బాధ్యత వారియందే కలదు. ఎల్లరకు శ్రేయోదాయకమైన విషయమైనచో రాష్ట్రప్రభుత్వమువారు నిర్వహించకపోరు. గనుక ఆవిషయము లట్లుంచి తక్కుంగల దేశములోని దురాచారములను పారద్రోలుటకు ప్రయత్నించుట మనకు కర్తవ్యమైయున్నది.

రాం:-నిజమే! ముఖ్యముగ త్రాగుడును మాన్పించవలెనన్న కాంగ్రెసువారు ఇతర వృత్తులపై అధిక పన్నులు విధింపవలసియున్నది.

జయ:-ఎందువలన?

రాం:-ఆప్కారీపైవచ్చు పన్నులచే, మన దేశములోని బాలబాలికలకు విద్యాసౌకర్యము కలుగుచున్నది. ఇప్పుడు

త్రాగుడు మాన్పించిన విద్యాసౌకర్య నిమిత్తము కావలసిన ద్రవ్యమును ఇతర వృత్తులనుండి వసూలు పఱచక తప్పదు.

దేశ:-ఏమి! యీ విపరీతము. త్రాగుడుమీద వసూలుపరచిన ద్రవ్యమునం విద్యాసౌకర్యము నిమిత్త ముపయోగించుట, ఛీ, యెంతటి అవినీతి. పంతులుగారూ! మీ రనినట్లు సద్విషయములపై వసూలు చేసిన పన్నుద్రవ్యము‌ను విద్యాసౌకర్యమున కుపయోగించుటయే మేలని నాకు దోచుచున్నది.

జయ:-ఎటుల జరుగనున్నదో యెవరు చెప్పగలరు ?

రాం:-దాసుగారూ! నేడు మీ రిటనుండి యెచ్చటకు బోయెదరు ?

దేశ:-నా మిత్రుడగు వకీలు శాస్త్రిగారివద్దకు పోయెదను.

జయ:-చాలదూరము వెళ్ళవలసియున్నారు. అయితే రైలు ప్రయాణమా ?

దేశ:-లేదు. కాలినడకతోడనే పోవ నిశ్చయించితిని.

రాం:-సరియే! యింక పోయివత్తమా ?

జయ:-అటులనే దయచేయుడు.

[నిష్క్రమింతురు.]

---

## ద్వి తీ య ర ం గ ము.

(శిష్యుడైన శివన్నకు సంస్కృతపాఠమును చెప్పుచు, గురువులైన ఆనందశాస్త్రిగారు ప్రవేశింతురు.)

ఆనం:-[పాఠమునాపి] శిష్యా! ఏదిరా? నశ్యపుకాయ.

శివ:-నశ్యం అయిపోయిందండీ. ఇందాక పస్తూవస్తూ అవధాన్లవారివద్ద రెండు చిటికెలు వేయించుకొని కాయలో యెక్కించాను. దారిపొడుగునా పీల్చడంతో ఆకాస్తా ఖర్చూడా అయిందనుకుంటాను. ఏమైనా అడుగూ బొడుగూ వుందేమో చూడండి. [పొడుముకాయ యిచ్చును.]

ఆనం:-[పొడుమురాల్చుకొనుచు] అబ్బే, ఏముందిరా, యిందులో బూడిద, బాగానేవుంది. ఇవాళ గడిచేవిధానం ఎలా? ఆ, సరే. ఒరే, శివన్నా! యిలారా నిన్నొకమాట అడగాలి.

శివ:-దగ్గరే వున్నానుగా. అడగండి, యేవిషయమో.

ఆనం:-మీ అమ్మగారు అలా మంచంలో వుండటంచేత, యింట్లో నేను పడుచూయున్న అవస్తంతా చూస్తున్నావుగానాయనా?

శివ:-చూడకేం పాపం. యెలాగో అలా తిప్పవుడకేసుకుంటూ వున్నప్పటికీ మిగిలిన విషయాలల్లో మహా అవస్తపడుతున్నారు. ఏంచేస్తాం!

ఆనం:-ఏంచెయ్యాలన్నా చెయ్యవచ్చు. మానవ ప్రయత్నం వూరకనేపోతుందీ! సరేకాని, మనదొడ్లోకి ప్రతిరోజు

మంచినీళ్ళ కొస్తుందే, చెంగావి చీరగట్టుకుని ఒకావిడ, చూశావ్ ?

శివ:-అవును చూచాను. ఆతల నెలసిన మనిషి కాదండి, పేదముత్తైదువపాపం. అయితే ఆమెను భర్త వదిలిపెట్టా డని వింటాను నిజమేనా ?

ఆనం:-ఏమో ఆ విషయాలన్నీ మన కెందులకు. ఆమె యెక్కడనుండియో ఒక పిల్లను తీసుకొనివచ్చి పెంచు తున్నది, రజస్వల అయినదట. ఎక్కడా యింకా సంబం ధం కుదుర లేదు.

శివ:-ఎందువల్ల పిల్ల మంచిదికాదా ?

ఆనం:-పిల్ల కేం వరహాలగని. అయితే ఆమెకు కొంచెము డబ్బు మీద ఆశ వున్నట్లు చెప్పింది.

శివ:-అయితే మీ రేమంటారు ? నాదగ్గర డబ్బు లేదే ?

ఆనం:-ఓరీ భ్రష్టా ! గురువుగారు చేసుకొనదలచిన పిల్లనటరా నీవలా అనేది ?

శివ:-అదా సంగతి ! నా కేం తెలుసుమరి. అయితే పైసంగతి చెప్పండి.

ఆనం:-నాల్గువందలిస్తే ఆపిల్లను నాకిచ్చి వివాహము చేస్తా నన్నది. ప్రథమభార్య యుండగా రెండవపెండ్లి చేసుకో వచ్చును. శాస్త్రాలన్నీ వప్పుకుంటయ్. మరేంభయవా లేదు. అందులో యజ్ఞం కూడా చెయ్యాలనుకుంటున్నా నా ! ఆకురూపితో యీ అవస్తంతా పడేకంటే దీన్నే

అడ్డం పెట్టుకోవాలనివుంది. యేమంటావు. నేను చెప్పిన విషయం బాగావున్నదా ?

శివ:-సరే, కానివ్వండి. యింట్లో మనిషివుంటే వుపయోగం లేకుండా పోతుందా ?

ఆనం:-సరేకాని యీమాట యెవ్వరితోటి అనకూడదు. ఎవ్వరికిని తెలియకుండా మూడు నిముషాలల్లో ముడిపెట్టుకు రావాలి. ఈ సంగతి తెలిస్తే డబ్బు యింకా యెక్కువ పెట్టి రెచ్చకొడతారు.

శివ:-అంతమాత్రం ఘనులుకూడా వున్నారూ దేశంలో !

ఆనం:-పెండ్లి పెటాకులు లేక పిడిరాళ్ళవంటి బ్రహ్మచారి ముండాకొడుకులు, కో అంటే కోటిమంది వున్నారు.

శివ:-చదువు చట్టుబండలు లేకపోతే యెలా అవుతయ్ పెళ్ళిళ్ళు, నావలె మీవంటి గురువుల నెవ్వరినైనా ఆశ్రయించుకొని తిరుగుతూవుంటే ఎలాగో అలా ఆకాస్త గడవక పోతుంది. తెలివితక్కువ సన్యాసులంటే యిలాంటివాండ్లేనండీ. అయితే మీరిప్పుడు చెప్పే విషయంలో నాకు యింకొక అనుమానం వుందండి.

ఆనం:-ఏమిటా అనుమానం ?

శివ:-ఒక పెండ్లాముండగా రెండో పెండ్లాన్ని చేసుకుంటే, ధర్మపత్ని అంటారే, మరి యీ విడా ఆవెడా ?

ఆనం:-ఆ, ధర్మపత్నిని, సింగినాదమూను, ఏదో లోకానికి అడ్డం. యిబ్బంది వచ్చినప్పుడు యీ విచారణంతా

మెవరుచేస్తారు? ముందు గట్టిగా ముడిపెట్టుకుంటే ఆ పైన అదే పనిసిపోతుంది.

శివ:-సరే! మీ యిష్టం వచ్చినట్లు కానియ్యండి.

ఆనం:-ఒరే! శివన్నా! మాట్లాడుతూ మాట్లాడుతూనే చాలాదూరము వచ్చినట్లున్నదే?

శివ:-చాలాదూరమేమిటి దగ్గరకే వచ్చాం. అదిగో! అటు చూడండి. ఆ రావిచెట్టుదగ్గర మేకలను మేపుకుంటూ ఎవ్వరో వున్నట్లున్నది. అక్కడికి వెళితే మనపని త్వరగా అవుతుంది. పోదాం పదండి.

ఆనం:-మేకపోతులను బేరమాడటంలో నీకు అంతగా అనుభవం లేదు. నేను మాట్లాడుతాను. నీవు మెదలకుండా వుండు. తెలిసిందా?

శివ:-అలాగే వుంటాను. లేనిపోయిన బరువును నెత్తినెత్తుకోటానికి నేనంత వెర్రివాడనా?

ఆనం:-సరే యిక నడూ పోదాం.

[నిష్క్రమింతురు.]

[గొల్లవాడు ప్రవేశించును.]

గొల్ల:-టుర్ హుమ్మయ్. ఓరి నీమందసావా. నిలకుండా సత్తుండయ్యేంరా. యియాల యెవరిమొగం సూశానో కాని మందెయ్యలేక యిసుగొత్తుండదిపానం. [ప్రక్కను చూచి] ఎవరా వచ్చేమడుసులూ! పగటేశగాళ్ళల్లే వుండారే! యిట్టొత్తుండా రెందుకూ, నాకా డేముండది యీటానికి.

(బ్రాహ్మణులు శ్లోకములు చదువుచు ప్రవేశింతురు.)

గొల్ల:-ఎహా. వూరుకోండశా. మాయదారిగోలా. గొఱ్ఱిలు బెదురుతుండయ్. అంతా యేళగాళ్లే డబ్బులు గుంజటానికి. ఎల్లండి ఆకాడికి. ఎల్లండయ్యా!

ఆనం:-ఒరే. మేము పగటివేషగాండ్రముకాముర? స్వచ్ఛమైన బ్రాహ్మణులము.

గొల్ల:-అయితే జగమెరిగిన బాంబడికి జందెమెందుకంటారుగందా పెద్దలు. నిజంగా మీారు బాంబలైతే యిట్టెందుకుంటారూ అంటా. ఆ! అయితే మీారొచ్చిన పనేందో మణిగి సేసుకోండి.

ఆనం:-మాకు రెండు మేకపోతులు కావలసివచ్చామోయ్. మంచివేమైనా వున్నాయా?

గొల్ల:-యిప్పుర్గల్తం యేనిగత్తొండం వూరుకోదంటారు యిందుకే కామాల్సబాబు. సూసిందల్లా మీాకే కావలంటారు. ఈడేం తేరగాలేవు తీసుకెల్లానికి.

ఆనం:-మాకు ఉచితముగా నక్కఱలేదు. తగిన రొక్కమిచ్చి గొనిపోయెదము.

గొల్ల:-అయితే జీవాని కేపాటిత్తారో సెప్పండి?

ఆనం:-సొమ్ము నీది. కొనేవాళ్ళంమేము, కాబట్టి నీవే ధర చెప్పు. గిట్టుబాటైతే కొంటాము.

గొల్ల:-పెద్దయ్ ఒకటోటి వరాన్నర, సిన్నయ్ వరావరా. అంతకుతక్కవ లేనేలేవు.

ఆనం:-ఇంకొకమాట చెప్పాలోయ్.

గొల్ల:-ఇదంతా యేమకబేర మొందుకు! కొనదలిస్తే జత కొండొరాలు.

ఆనం:-సరే, యిదిగో! ప్రైకం.

గొల్ల:-(ప్రైకము తీసుకొని) అయితే అడగమరిశాను బాంబడా! యీపోతుల్ని తోలుకెల్లి మీరేంచేత్తారయ్యా?

ఆనం:-యజ్ఞములందు బలిచేయుదుము.

గొల్ల:-దానివలన లాబమేందో?

ఆనం:-యజ్ఞముచేసినవారికి స్వర్గము వచ్చును.

గొల్ల:-అయితే బాబూ! తెలవకడుగుతానుగందా మరిగత్తే, యెగ్గంసేసినోళ్ళంతా రంబతోసుక పడతారంటగా నిజమేనా?

ఆనం:-అవును. నిజమే కావచ్చును.

గొల్ల:-సరేకాని; తండ్రీ యెగ్గంసేసి, కొడుకూ యెగ్గంసేస్తే ఆళ్ళిద్దరూ రంబతో యెట్టావుంటారయ్యా; కొడుక్కి తల్లి అవుద్దిగామరి?

ఆనం:-ఆసంగతియంతా నీకెందుకోయ్. శుభ్రముగా మేకలను కాచుకొనక, ఒరే! శిష్యా! అంగవస్త్రములు పోతుల మెడలకు గట్టి పట్టుకొని ముందు నడుస్తూవుండు. నేను వెనుకనుండి తోలుకవస్తాను.

శిష:-(మేకలమెడలకు అంగవస్త్రములు కట్టుచుండును.)

గొల్ల:-బిగించికట్టమాక బాంబడోయ్. సస్తాయ్ పున్నానికి. గొఱ్ఱెలు పోతుండయ్. నేనెట్లుండా!

[అందరు నిష్క్రమించును.]

(ప్రవేశము—దేశదాసు.)

దే:-అదియేమి! బ్రాహ్మణులయ్యు మేకపోతులను దో[illegible] కొని వచ్చుచున్నారు? కొంచెమాగి వారి యుదంతము నారసిపోయెదనుగాక.

[బ్రాహ్మణులు—ప్రవేశింతురు.]

దేశ:-ఓ బ్రాహ్మణోత్తములారా! ఎటనుండి యెటకు బోవుచున్నారు?

ఆనం:-ఇచ్చటి సమీప గ్రామమునుండి యింటికి బోవుచున్నాము.

దేశ:-ఈ నోరులేని జీవముల నేల గొనిపోవుచున్నారు?

ఆనం:-యజ్ఞమునందు పశుబలి నిమిత్తము.

దేశ:-వీనిని బలియిచ్చినగాని యజ్ఞము సంపూర్తికాజాలదా? వీనికిమారు పిష్టపశువును చేసి వధింపరాదా?

ఆనం:-మేము చాల బడలికగనున్నాము. నీతో విశేషముగ మాటలాడలేము. నీదారిని నీవు బొమ్మా.

దేశ:-అయ్యా! ఈ ప్రపంచమున గల్గు ప్రాణులన్నియు సమానమేగదా? మన శరీరమున కేదేనిహాని సంభవించె నేని మన మనంబుల నెంతగ నొచ్చుకొనెదమో యెఱుం

గదా? సర్వమును నెఱింగిన మీవంటివారికి నేను నీతిని బోధించునంతటి శక్తుడను గాకున్నను, తమ హృదయంబుల నీ జీవహింసనుగూర్చి సుంత యోచింప బ్రార్థించుచున్నాను.

సీ॥ కమనీయదేహంబు జీమగుట్టిన నెంత
చిమచిమలాడునో చెప్పగయ్య!
తిరుగుకాలికిముల్లు విరుగగా మనప్రాణ
మెంతవేదనగుందు నంతలోన
గాలివీవగ నలుసు కంటిలో బడగాను
యెంతబాధించునో యెఱుగరయ్య!
పాదరక్షల రాయి పడికాలినొత్తినన్
బ్రాణమెంతటిబాధ పడునో భువిని

తే॥ గీ॥ ఆకులలముల దినుచు నీలోకమందు
సంచరించుచు నుండెడు జంతుకోటి
తమకు నపకారమేమైన దలచునయ్య?
అవని దయమాలి హింస జేయంగనేల?

ఆనం:–తూర్పు పడమరలు తెలియని వాళ్ళంతా ధర్మాలు బోధించడంచేతనే కాల మెంతటి యధోగతి పాలైనది. యజ్ఞములనుకూడా ధ్వంసంచెయ్యడానికి మొదలు పెట్టావుట్రా నాయనా! నీవు చాల బుద్ధిమంతుడవు కాని యిక దయచెయ్యి. ఒరే శిష్యా! నే వెళ్ళుతున్నాను

గాని, యీ పాడుదయ్యాం నా వెంటబడకుండా తరిమేసి బయల్దేరిరా శొంఠదలాగా.

శివ:-యేయ్ జాగ్రత్త! నోళ్ళు దగ్గఱపెట్టుకొని మాట్లాడు. నీతులు చెప్పవచ్చావ్. మా వేదాలలో కీపపాలైనా చదివావ్. యెనభై రెండు పన్నాల వేదం తలక్రిందులుగా చదివిన మా గురువుగారినేనా నీవాక్షేపించేది ?

దేశ:-అయ్యా ! జీవహింస జేయవచ్చునని యే వేదములో నున్నదో చెప్పగలరా ?

శివ:-ఆట్టే మాట్లాడితివా, మా గురువుగారు వచ్చి వచ్చి నీ దుంపదెంపుతారు ! ఎందుకు అవస్థపడతావుకాని వెళ్ళు. నేను పోతున్నా. [నిష్క్రమించుచుండు.]

దేశ:-ఆహా ! యేమి నీ యవినీతి ! పవిత్రమైన బ్రాహ్మణ కులమునందు జన్మించిన వారలమని చెప్పుకొనుచు నిట్టి లోపముల జేయ బాల్పడుచున్న మీ నేమనవలయును ? ఇది యంతయు నీ భారతావనియొనర్చిన పూజాఫలితమే; ఇట్టిచో నింక ధర్మము చెడెనని యనుకొననేల ?

తే॥ గీ॥ అన్నిజాతులకంటెను నగ్రజాతి
యందు జన్మించి యీరీతి యజ్ఞములను
జీవహింసలు బ్రాహ్మణుల్ జేయుచుండ
నింక ధర్మంబు ధరలోన నిలచుటెట్లు ?

కానిమ్ము. యేమనుకొనిన నేమి ప్రయోజనముకలదు.

[కీర్తనతో నిష్క్రమించును.]

## తృతీయ రంగము.

[జాతర సమయమున గణాచారి ఊగులాగుచుండ, ఉపచారములు చేయుచు కొందఱు మూఢభక్తులు కీర్తనలు పాడుకొనుచు కొలుపులు కొలుచుచుందురు.]

గణా:-వాలా! వాలా!

భక్తులు:-(సాంబ్రాణిపొగ వేయుచు) నీకేం కావాలో! సెప్పు తల్లీ!

గణా:-ఓ భగతుల్లారా! నా కడుపు మండిపోతోంది. హారం కావాలి. హారం.

భక్తులు:-అట్టాగె తల్లీ! నీ ఆగ్గెపెకారం నియేదం శాత్తాం అమ్మా. దయుంచాలి. కనిపెట్టుకుండాలి.

గణా:-ఓ! భగుతుల్లారా! నాకు యేటేటా జాతర్లు సెయ్యటం లేదూ, ఇకూరుకోనూ. మిమ్మల్నీ, మీ పసువుల్నీ, యిళ్ళనీ, వాకిళ్ళనీ నాశనంచేత్తా జాగత్తగా వుండాలీ, వాలా! వాలా!

భక్తులు:-శాంతించమ్మా, సాంతించూ, అట్టాగే, యేటేటా జాతర్లు శాత్తాం. చూత్తారేందశ! నరకండి యాటల్ని.

(కీర్తన పాడుచుందురు.)

గణా:-వాలా! వాలా!

(అని వూగులాడుచుండును.)

(దేశదాసు ప్రవేశించి.)

దే:-ఓ మూఢభక్తులారా! ఏల మీ రిట్లు నోరులేని జంతువులను జంపెదరు. ఆగుడు, ఆగుడు.

భక్తులు:-(తిరిగి చూచి) ఎవడన్నా! ఆగనుంటాము. యీడి కెట్టాగు అమ్మోరిసేతులో మూశింది యియ్యాల!

దే:-సోదరులారా!

సీ॥ దేవుఁడొసగిన పూఁదిని మెచ్చటోనుండి
యే యుపకారంబు జేయరాక
నదినీళ్ళు ద్రావుచు మదికి భీతిని గొల్పు
క్రూరజంతువుఁ గొచ్చు దారిబోక
ప్రకృతిసిద్ధంబునై పఱఁగు ప్రదేశంబె
వాసయోగ్యముగాఁగ వఱలుచుండి
యేజీవజంతువున్ హింసజేయఁగబోక
సాత్వికంబుననుండు జంతువులను

తే॥ గీ॥ బట్టి తెచ్చియు గత్తుల బట్టి మీఱు
దేవినెపమున జంపుచో దిక్కులేక
నార్తి గృశియించి మరణించునట్టి వేళ
జూచి సహియించునే యెట్టి నీచుఁడైన.

నిజమైన దేవత లిట్టితుచ్ఛమైన కోరికల గోరునా?

సీ॥ దేహిసత్యంబైన దినుటకు నితరమౌ
యాహారమొంటేని యవని లేదె?

పలువిధభక్ష్యాల పాయసంబుల దెచ్చి
భక్తినివేదింప ముక్తినిడదె ?
రుధిరమాంసంబుల నధికంబుగానాకు
దెచ్చిపెట్టుడటంచు దేవి యనెనె
కల్లుసారాతప్ప గమ్మని నేతినిన్
ద్రాగబోవదె దేవి బాగుగాను

తే॥ గీ॥ అఖిలజీవుల రక్షించు యాదిశక్తి
యైన నీరీతి మిమ్మల నడుగునయ్య ?
ఒకరి రక్షింప నితరుల నొక్కజంప
నిచ్చగించిన దేవిగా నెంచనగునె.

అమ్మవారి పేరుచెప్పి మీ రొక్క యుదరములను నింపుకొనుటయేదప్ప నింక నేమైన బ్రయోజనము కలదా ? జీవహింసజేసి రుధిరమాంసంబుల నర్పించినగాని దేవి తృప్తిబడదా ? ఆదిశక్తియని చెప్పబడు దేవతయిట్టి తుచ్ఛమైన కోరిక లెన్నడైన గోరునా ? హరి ! హరీ ! దట్టమై యలముకొనిన మీ యజ్ఞానాంధకారము బాయు టెట్లు ? లోకమున మానవుడై జన్మించినవాడు చేయ వలసిన మహాత్కార్యము లెన్నియోయుండ, నిట్టి తుచ్ఛ కార్యములుచేయ సమకట్టనేల ? మహామహులెల్లరును మీకొఱకేగదా సర్వసంగ పరిత్యాగులై పాటుబడు చున్నారు సోదరులారా ! కన్నులు తెఱచి లోకము నొక్కమారు చూడుడు.

సీ॥ కోటీశ్వరుల్ గూడ గూర్చిరాట్నము మీద
ఖద్దరు వడుకంగ గ్రాలుచుండ్రి
అతి సౌకుమార్యులే అన్నహారంబుల
విడనాడి పలుపాట్లు పడుచునుండ్రి
అన్నిమతముల వారైకమత్యముతోడ
శాంతియుద్ధముసేయ సాగుచుండ్రి
ఏనాడుకూడను నెండకన్నెఱుగని
సాధ్వులెల్లరు సేవ సలుపుచుండ్రి
తే॥ గీ॥ ఇట్టిసమయాన మీరెల్ల యిట్టిపనుల
జేయుచుండిన దేశంబు జింతగుములు
దేశసేవయె మనకెల్ల దిక్కుగాన
హింసవిడనాడి మేలు నూహింపరయ్య.

1_భక్తు:-అమ్మోరిని ఆచ్చేపించే తెలివికూడా వుందీ నీమొగానికి! యెల్లవయ్యా! యెల్లు. యెవరో దేశంకోసం పాటడుతుండారంట, ఈయన సెప్పొచ్చాడంట. కలరాపుట్టి మడుసులు సత్తుంటే ఓరన్నా! అడ్డపడ్డారా? ఏకాడికైనా జాతర్లు చేత్తామని అమ్మోరిపేరుసెప్పి ముడుపులు కట్టుకుంటే పోయిందిగాని, లేకపోతేనా?

2_భక్తు:_యీావరసన అమ్మోరు గంటమోగినట్టు సినంపూని సెపుతుంటే జాతర్లు సెయ్యకుండా మానుకుంటారంటయ్యా! నరకండశా: యీాటల్ని సూత్తారేం

[యాటను సాధించబోవుదురు]

దే:-ఏదీ! మీఅమ్మవారు నన్నేమి చేయునో! చూచెదను? ఇత్తఱి నా ప్రాణములన్నైన గోలుపోయెదనుకాని, మిమ్ము లను జాతుహింసజేయనివ్వను. మున్ముందు మీ దేవి యొక్క సత్యాసత్యములను దెలిసికొనవలసియున్నది.

1-భక్తు:-మోపెడు పరిచ్ఛలిత్తది. కావాలిస్తే నూసుకోమంటె మా అమ్మోరు యాపాకునములుద్ది నూడు.

గణా:-వాలా! వాలా! [ఊగుచుండును.]

దేశ:-ఇదిగో! మీదేవిసత్య మిప్పుడే కనుపడును. (కిరస నాలగుడ్డను వెలిగించి గణాచారికి తాకించపోవును. గణాచారి భయపడి పరుగెత్తిపోవును.)

అందఱు:-[నిర్విణ్ణులైయుందురు.]

దేశ:-చూచితిరా! మీ అమ్మవారి మహాత్మ్యము.

1-భక్తు:-అయ్యా! నమస్కారం బాబూ! నాకేం పనిలేక పోవటంచేత యీ విధంగా పొట్టపోసుకుంటుండా. మీ మాటలు విన్నప్పటినుంచి అందోందోమనుసు మారిపోతున్నది. మంచిచెడ్డ తెలియక పాడుపొట్ట కోసం గతిలేక యీ జాతర్లంటు సుట్టించి కాలం గడుపుతున్న నాకు యీ రోజుతో బుద్ధివచ్చింది. యికమీద యిట్టాంటిపని మానుకొని మంచిగా తిరుగుతాను. దయుంచాలి బాబూ?

దే:-మంచిది నాయనా! రమ్ము పోవుదము. [మిగిలినవారిని చూచి] ఓ యువనీతులా! ఎందఱెందఱు మహానుభావులు మనకొఱకు, మన దేశముకొఱకు పడరాని పాట్లుపడి, తుదకు జీవములను సహా గోల్పోయిరో! యెఱుంగరా? ఇకనైన నీ దుర్వృత్తులనుమాని,

సీ॥ లోకంబు పొగడగ లోకమాన్యుండైన
బాలగంగాధరు లీలదలచి
పంజాబుకేసరై భక్తితో నెగడిన
లజపతిరాయి మేలవనిదలచి
సద్యశోవిభవుఁడై జగతిలో నుతిగొన్న
చిత్తరంజనదాసు శీలమెఱిగి
దుగ్గిరాలకులాన నిగ్గైన గోపాల
కృష్ణాంధ్రరత్నుని గీర్తిదలచి

తే॥ గీ॥ ఇంక దేశార్థమై లోన శంకలేక
దమదు జీవాల నర్పించి ధన్యులైన
భక్తవర్యుల నెదనిల్పి భారతాంబ
సేవజేయంగ రండిదే శీఘ్రగతిని.
[కీర్తన పాడుకొనుచు నిష్క్రమించును.]

(తెఱవ్రాలును.)

# తృతీయాంకము

## ప్రథమరంగము.

### రాంపంతులు-జయశర్మగార్ల ప్రవేశము

రాం:-సర్వజనులకు ఉపయోగపడునట్లు యీ ఋణపరిష్కార చట్టమును వ్రాసుచేసినారు.

జయ:-యీ పద్ధతి జమీందారులకు చాల నష్టము కలిగించునేమో ?

రాం:-అయినను తొందరలేదు. లేకపోతే రైతులు బకాయి బాకీలు తీర్చడం కష్టంకాదండి.

జయ:-నిజంగా మీరన్నట్లు జమీందారులు చాలామందిని యీ విధంగా బాధించుతున్నారండి. నేటికీ కాంగ్రెసు ప్రభుత్వము వచ్చిన తర్వాత యీ సౌకర్యం ప్రజలకు చేశారంటే చాల కొనియాడదగిన విషయమే. అయితే నిన్నటికేసు ఏమైంది ?

రాం:-ఏమైంది, పోలీసువారు దర్యాప్తుచేసి భూమిలో పాతిపెట్టబడివున్న బాలికను పైకి తీశారు. యింకా హంతకు డెవ్వరైనదియు తెలియలేదు.

జయ:-ఎంతటి దుర్మార్గంజరిగిందండీ పాపం. నేనింకా ఆ పిల్ల తల్లి తండ్రులు యేడుస్తూ వెళ్ళుతుంటే ఏ చెరువులోనో, నూతిలోనో పడ్డదని ఊహించాను. యిలా జరగడానికి హేతువేమిటి ?

రాం:-చిన్నతనంలో చూడట్టానికి బాగావుంటుందికదా అని
ఏదో గెంపుయూడు శొకేలుపెట్టి మెళ్లోకి యేవో చేయించి
పెట్టుకున్నారట. ఆ కాస్తా యెవడో చూచి కాజెయ్యాలని
యీపని చేశాడనుకుంటున్నారు.

జయ:-హరహరా! ఎంత దుర్మార్గం?

రాం:-యిదేకాదు, యింతకంటె మనవాళ్ళలో గొప్ప విష
యాలే జరుగుతున్నయ్.

జయ:-అదేమిటండోయ్?

రాం:-ఏమిటండోయ్ అని నన్ను అడగటమెందుకు? ఆరోజు
ఉదయంపూట వూరివెలుపల మనమేం చూచాం.

జయ:-అవునవును. జ్ఞాపకం వచ్చింది. ఇంకా ఆశిశువుకి
అవయవాలుకూడా బాగా యేర్పడ్డట్లులేదే?

రాం:-అయితేనేం, కక్కుర్తికి ఎంతపనైనా చేస్తున్నారు.

జయ:-యిది వాళ్ళ పొరపాటు కాదండీ. ఆడపిల్లలను చిన్న
తనంలో వయోవృద్ధులకిచ్చి వివాహాలు చేస్తున్న తల్లిదం
డ్రులదేలోపం. చిన్నతనంలో పెనిమిటిపోయి సౌఖ్యాలు
అనుభవించడానికి వీలులేకపోవడం అలావుంచి, పైగా
వేషంకూడా మార్చేస్తారండీ. ఇది చాలా అన్యాయంగా
వుంది?

రాం:-అందువలనే స్త్రీ పునర్వివాహాలు అవసరమని మన
వాళ్ళలో కొందరు చెప్పుచున్నారు. అందులకు కొందరు
ఒప్పుకోనుటలేదు.

జయ:-అయ్యో పనులు ఎలాగో అలా అయిపోతూనే వుం టయ్. మీరు పట్టుకొని దేవుళ్ళాడితే ఆగుతుంది ?

రాం:-యీ అవస్థంతా పడేకంటె రజస్వలానంతర వివాహాలే చేసేస్తే కొంతవరకు బాగావుంటుందని శారదాయాక్టు ప్యాసయింది.

జయ:-యే శారదాయాక్టు ప్యాసయినను, విధవా విహాలు తప్పకుండా యెప్పుడూ వుండాలిసందే ?

రాం:-ఎలాగో ఉంటూనే వుంటయ్ గాండి లేకపోతే చాల కష్టం.

జయ:-కష్టమని పిల్లగా అంటారేం. ముమ్మాటికి కష్టమే. ఏమాత్రపు సౌఖ్యం అనుభవించడానికి అర్హతలేని ఆడ వాళ్ళువున్నా వకటే చచ్చినావకటే భర్తతోపాటు వీరిని కూడా యాత్రకు పంపితే మంచిది.

రాం:-పూర్వకాలంలో అలాగే జరుగుతూ వుండేది. అదిమం చికాలం. స్త్రీలు యీఅవస్థంతా పడటం కష్టమని సహ గమనాలు చేసేవాళ్ళు, తర్వాత తర్వాత మోక్షంగా చేయించుతూ వచ్చారు. రాజారామమోహన రాయి గారికాలంలో సహగమనాలు పూర్తిగా మాన్పించేశారు,

జయ:-అలా యెందుకు చేశారు ?

రాం:-భర్తతోపాటు చావ నిశ్చయించుకొన్నవాళ్ళకు సహ గమనధర్మం పనికివస్తుందికాని, బ్రతికివుండాలనుకున్న వాళ్ళకెందుకు ? అందుచేత మోక్షంగా చంపకూడ దన్నారు.

జయ:-పోనీ యిప్పుడలా చావడానికి వీలున్నదా ?

రాం:-లేదు. ఆలాంటి వుద్దేశ్యాలు వున్నవారిని తప్పకుండా గవర్నమెంటు అరెస్టు చేసి చావకుండా జాగ్రత్తగా చూస్తూవుంటారు.

జయ:-కాబట్టి ఏ పునర్వివాహాలో చేయించడమే మంచి దంటారు ?

రాం:-అవును మరి, యింకా వేరే చెప్పాలీ! ప్రయత్నంలో వుంది మేలు.

(కీర్తనతో దేశదాసు ప్రవేశించును.)

రాం:-దాసుగారూ! ఎచ్చటినుండి యీరాక ?

దేశ:-ఇంటివద్దనుండియే వచ్చుచున్నాను.

జయ:-చాలా ప్రొద్దెక్కినదే. ఇంతసేపేం చేస్తున్నారు ?

దేశ:-మా గ్రామంలోని ఎలిమెంటరీస్కూలు టీచరుతో మాట్లాడుతూ ఉండటంచేత ఆలస్యమైంది. పాపం ఆయనకు యీరోజు గ్రాంటు ఇన్స్పెక్షనైందిట. అన్ని విషయాలు బాగానే వున్నప్పటికి శ్రీవారు నూటికి ఇరవై రూపాయలు తక్కువగా రికమెండు చేశారట.

రాం:-ఎందువల్ల పాపం ?

దేశ:-ఎందువల్లనో మనకందఱకు తెలిసిన విషయమే. వేరే చెప్పకోవడమెందుకు ?

జయ:-యీ లంచగొండితనాలు ప్రతి డిపార్టుమెంటులోనూ అధికమైపోయినయ్యండీ.

రాం:_అధిక మేకాదు. ప్రజలను పీల్చి పిప్పి చేయుచున్నవి.

దేశ:-యిది యాతయు మన లోపమేగాని ప్రభుత్వమువారి చెంతమాత్రమును లేదు గనుక, యీ లంచగొండితన మును ఉద్యోగులలో లేకుండ నిర్మూలించుటకు మన మెల్లరమును ఆందోళన జరిపి ప్రజలకు మేలు కూర్చవలసి యున్నది. యింక నాకు చాల పనికలదు. నే పోయి వచ్చెదను.

రాం:_మేమును వెళ్ళుచున్నాము.

[నిష్క్రమింతురు.]

ద్వితీయరంగము.

ఒకచోట నొకహరిజనుడు పడియుండగా దేశదాసు ప్రవేశించును.)

దేశ:-నాయనా ! ఇట్లేల నిచ్చట పడియుంటివి ? నీయుదంత మేమి ?

హరి:-అయ్యా ! యేమిచెప్పుదును. మార్గమునుబట్టి వచ్చు చుండ నాలుక యెండి యీ చెరువున దాహమార్చుకొను చుండ నెవ్వరోవచ్చి నీవెవ్వడవని నను ప్రశ్నించిరి. అంత నాకుల గోత్రములు చెప్పితిని.

దేశ: తరువాత ?

హరి:-నేను హరిజనుడనని తెలుసుకొనిన వెంటనే, తన చేత నున్న లాఠీతో గొట్టి నాయొడలు పిండిచేసిరి.

దేశ:- పాపము! ర క్తముకూడ గారుచున్నదే; సోదరా! నీకెట్టి యిక్కట్టులువచ్చినవి. ఔరా! మనసోదరులలో నెంతటి దౌర్జన్యత ప్రబలుచున్నది! లేకున్న నందఱమును నొకే విధమున జన్మించలేదా! ఒకరినిగోసినరక్తమును మరియొక రినిగోసినక్షీరమును వచ్చునా? అయ్యో! యీఅంటరాతని తనము యెక్కడ దాపరించినదో గాని యీవిధమున ప్రాణములను గూడదీయుచున్నదే? చివరకుమేఘములు వర్షించిన నీటినిసహితము ద్రాగుటకు వీరికి నర్హతలేదా? దీనిలో సవర్ణులమల్లె యేమిపోయినది. అవుసరము వచ్చి నప్పుడు మాలపల్లెలలో ప్రవేశించి హరిజనులను రాచు కొనితిరుగుటలేదా! యెంతఅన్యాయము! అన్యాయమే కాదు దౌర్జన్యమని కూడా చెప్పవచ్చును. సోదరా! నిన్ను గొట్టినవారి సమీప గ్రామమువారే యగుదురా!

హరి:-అయినను వారినేమనగలము?

దేశ:-ఇట్టి దౌర్జన్యమును మానుడని ప్రబతిమాలుదము.

హరి:-మనమాటలు వారికినచ్చునా?

దేశ:-నచ్చువఱకు బోధింతము. ఇప్పుడు గాకున్న నెప్పటి కైన మన యాశయము నెఱవేఱక పోదు. ఇదియే నన నేల? గాంధి మహాత్ముడు యుద్దేశించి ప్రారంభించిన యుద్యమములలో నేది కొనసాగలేదో వ్రేలు మడచి చెప్ప గలవారు గలరా! కావున మనకు దప్పక జయము కలుగును. ఇంక పోవుదము రమ్ము.

హరి:-అయ్యా! తామెన్ని బోధించినను, నాకు మాత్రము

భయముగనే యున్నది. పాపము మీకుగూడ నామూ
లమున బాధ పడుదురేమో యని తోచుచున్నది.

దేశ: మిత్రమా ! అధైర్య పడకుము. ఈ యుద్యమము
సామాన్యులచే నడుప బడు చుండుట లేదు. యిటు
వినుము.

సీ॥ సాక్షాత్తు కృష్ణుండు జగతిలో గాంధియై
వెలసి సత్వాల గావ నిలచి యుండ
ఘన దరిద్రము బాపగా ధర్మరాజౌచు
వల్లభాయిపటేలు వరలుచుండ
భీకరాకారుడై భీముసాటికివచ్చు
నబ్దుల్ గఫూరుండు హాయినుండ
కలియుగార్జునుడవు నల జనహరులాలు
అసహాయసూత్రాస్త్రి మందియుండ

తే॥ గీ॥ మదనమోహనమాళవ్య మాన్యుడైన
నకులుసాటిగ స్వారాజ్య నవ్యరథము
నడుప, సహదేవతయ్యాజి నడుముగట్ట
లేరు దిక్కించు భయముజేకూర నేల ?

సోదరా ! రమ్ము పోవుదము. (నిష్క్రమింపబోవగా కాపు
వాడొకడు ఎదురుపడి)

కాపు:-ఎవరయ్యా ! మీరు ? ఈ మాలముండాకొడుకుని
మహా పొగుడుతున్నారు ?

దే:-మేము మహాత్ముని యాజ్ఞానుసారముగ వర్తించు దేశ సేవకులము.

హరి:-అయ్యా! ఈతడే నన్నింతకుముందు గొట్టినాడు.

దే:-అయ్యా! ఒంటరిపాటున నిట్లేల నితనిని గొట్టితిరి? మీ కేమైన నపకారము చేసెనా?

కాపు:-అనవసరంగా మాట్లాడితే నీపనికూడా అంతే.

దేశ:-ఎందుచేత?

కాపు:-ఎందుచేతనా! యీ మాలవెధవను వెనుకవేసుకొని మాట్లాడుట చేత.

దేశ:-అయ్యా!

ఉ॥ మాలడుమాలడంచు పలుమారు వచించిన
లాభమేమి? యీ
మాలనుగోసినన్ రుధిరమా? మిముగోసిన క్షీర
మబ్బునా?
మాలతనంబు నెన్నుదుట వ్రాసెనె దేవుడు దొడ్డ
వార లె
క్కాలమునందొ వీరినిటు గారియపెట్టిరిగాని సోదరా!

మఱియు,

తే॥ గీ॥ భువిని దల్లిదండ్రులకును బుట్టినట్టి
వారలెల్లరు నొకజాతి వారుకారె
ఉచ్చనీచపు కులములు అచ్చముగను
గర్మచేగాక జన్మచే గలుగుటెట్లు.

వృత్తినిబట్టియు గుణమునుబట్టియు కులమును నిర్ణయింపవలయునుగాని, జన్మచేత కులము నెట్లు నిర్ణయింపనగును? తండ్రి గుణములు కుమారునకు నచ్చిననేకదా! జన్మచే కులము నిలచుట. ఈ యంటరాని తన మును యేనాడు మెవ్వరు నీరి నొుగంబున వ్రాసి యుంచిరో చెప్ప గలరా? బ్రాహ్మణునకు జన్మించినవాడు నీచకర్మముల నాచరించిన బంచమునితో సమానుడగును. పంచముడు సన్మార్గమున వర్తించిన బ్రాహ్మణ తుల్యుడగును. యిందు సంశయమొంత మాత్రమును లేదు. కర్మవలన అంటరానితనము వచ్చినదందురా? మన శరీరావయవము లెన్ని కార్యములలో నంటరానివై తిరిగి ఉపయోగ పడుచుండుట లేదా! అవుసరమైనప్పుడొకరీతిని, లేనప్పుడు మరియొకరీతిని, నీరినిజూచుట ధర్మ మగునా! మనవారు కళాశాలలో హరిజనులతో కలసి చదువుకొనుచుండుట లేదా! యీవర్ణములోని వారు ఉద్యోగస్థులైన నమస్కరించు చుండుట లేదా! యివి అన్నియును అవుసరముగనుక పాటింప రాదనెదరా! ఔరా! యీఅంటరాని తనమును నిర్హేతుకముగ కల్పించి మానవ సంఘముయొక్క ఐకమత్యమును పాడుచేయుటయే ఫలముగాని మఱి యితరముగాదు. అందుచేతనే స్వాతంత్ర్య రహితులై బానిసవృత్తిని పూనవలసివచ్చినది. సోదరా! నా మాటలలో నేమైన లోపములున్న నన్ను మన్నించి యదార్థమును గ్రహింప గోరుచున్నాను.

కాపు:-అయ్యా! తాముపచించిన దంతయును నిజమేగాని, అనాదినుండియు నీ యంటరానితనము వ్రేళ్ళు పాతుకొని యుండుటవలన నొక్కమారు తొలగించుటకు వీలుగాదని భావించు చున్నాను.

దేశ:-నిజమే! అయిననుమన మెల్లరమును నడుముగట్టి యీ విషయమున గృషిసల్పవలయును.

కాపు:-అయ్యా! ఇంతకుముందు నేనీ హరిజనసోదరుని యెడ జేసిన యపరాధమును మన్నించ గిలంనులకు ప్రార్థించు చున్నాను. నాశక్తి కొలదియు నీ నాటినుండి యీ అంట రానితనమును నిర్మూలించుటకు నేను ప్రయత్నించెదను యింక ననుజ్ఞ నిండు పోయివచ్చెదను.

దేశ:-మంచిది. పోయిరమ్ము.

హరి:-అయ్యా! ఇటనుండి యెచ్చటికి బోవుదము?

దేశ: వకీలుశాస్త్రిగారిని కలుసుకొన బోవలయును రమ్ము.

[నిష్క్రమించును]

---

## తృ తీ య రం గ ము.

(పూజారిసూరయ్య దేవునికి అర్చన చేయుచుండ ధర్మ కర్త ప్రవేశించును. సూరయ్య పూజనుండి లేచిచూచి)

సూ:-ఓహో! ధర్మకర్తగారా! దారితప్పి దయచేశారు దేవాలయానికి! యివాళ దేవునిమీద దయ వచ్చిందన్న మాట.

ధర్మ:-లేదండీ ఏదో వ్యవహారాల గొడవలో నుండటం చేత రావటం లేదు.

సూర:-ఏమిటో లెండి మేముపట్టుకొని దేవుళ్ళాడటమే కాని, ఎవరికి పుట్టినబిడ్డరా వెక్కి-వెక్కి యేడ్వనన్నట్లు మీకేం పట్టింది! మీవ్యవహారాలేమో మీరేమోగాని దేవుని గొడవలేనేలేదాయె

ధర్మ:-యిప్పుడు మాత్రం యేంతరుగువచ్చిందయ్యా! నిత్య ధూప దీప నైవేద్యములకు, వుత్సవములకు మాన్యములున్నవికదా ఏదో పేరుకుమాత్రం ట్రస్టీగావుండటమేగా నా పని. లెక్కలను తయారుచేసి బోర్డువారికి చూపించడమే మావంతుకాని యేమైనా అధికారాలున్నాయా పాడా: అమేషా పూర్వమువలె దేవాలయానికి వస్తూపోతూవుండటానికి ఏంచేస్తాం. ఎన్నేళ్ళనుంచో ఏకచక్రంగా దేవాలయాన్ని పరిపాలించిన మాకు యీ నాటికి యీఅవస్థ పట్టింది. పైగా యీలెక్కలు తయారు చెయ్యడంతో మాదుంప తెగుతోంది.

సూ:-లెక్కలు తయారు చేయడంలో మీకు చెప్పాలసిందేముంది, సర్వజ్ఞులు.

ధర్మ:-ధర్మకర్తలంటే అంతఅలాఘున అయిపోయిందన్న మాట. ఇదిగో సూరయ్యగారూ! ఇదివరలో మీరుసకా

లమునకు దేవాలయమునకు వచ్చినా రాకపోయినా! మంత్రాలన్ని కంఠతావచ్చి దేవాలయంలో పనులు సక్రమంగా జరిపినా జరుపకపోయినా యెలాగో గడచిపోయింది ఇకమీాదట అలాసాగదు. మంత్రాలన్ని నేర్చుకోవాలి. సకాలమునకు దేవుని అర్చించాలి. అలా లేకపోతే మిమ్మల్ని తొలగించి మరొకరిని యేర్పాటు చెయ్యాలిసివస్తుంది.

సూ:-పూర్వమెప్పుడో యీదేవాలయానికి గడ్డయెత్తింది లగాయతు యిప్పటివరకు అర్చకత్వం చేస్తున్ననన్ను తొలగించడం నీచేతకాదు కదా. నిన్ను పుట్టించిన బ్రహ్మచేతకూడా కాదు. నీతో అనవసరంగా విరోధమెందుకని వూరుకోవడమేకాని లేకపోతె ఏంచెయ్యాలో అదే చేసే వాణ్ణి.

ధర్మ:-ఏమయ్యా! మాటలు జాస్తిగా వస్తున్నయ్యే?

సూ:-ఒకటంటే పదంటారు. మీా మోచేతిక్రిందినీళ్ళు త్రాగి బ్రతుకుతున్నామా! ఏనాడో ఏమహానుభావులో పుణ్యానికి యేర్పాటు చేసిన మాన్యాలేగాని, నీహయాములో యేమైనా చేశావేమో వేలుమడిచి లెక్క చెప్పు విందాం. తుడుము దగ్గరనుంచి దేవతార్చన వరకు మేమే తంటాలు పడుకుంటూ మీాకు లొంగివుండాలన్న మాటే మున్నది? ఈ చాకిరీ యింకొచోట చేసుకుంటే లేదు? ఇదే మాకు సిద్ధాంతమా.

ధర్మ:- ఇంతలోనే కోపమొందుకయ్యా! లోకంలో జరుగుతూ వున్న సంగతులు చెప్పుతున్నానుగాని నీ మీద నాకు విరోధమా. దీనికే యిలాఅంటే హరిజన దేవాలయ ప్రవేశాలంటూ మరియొక ఆందోళన బయలుదేరింది. ఇక దాన్ని గురించి మీరెంత గందరగోళం చేస్తారో.

సూ:- గందర గోళం చెయ్యరు మరి. ఏవాటి అధోగతి ధర్మ కర్తలుంటే దేవాలయాలలో హరిజనులేకాదు పందులు కూడా ప్రవేశిస్తయ్.

ధర్మ:- ఏమైనా మన మెంచాస్తాం. కాలాను గుణ్యంగా ప్రవర్తించాలి.

సూ:- కాలానికీ దేవునికీ సంబంధమా.

ధర్మ:- హరిజనులు ప్రవేశించిన దేవాలయము లోని దేవుడు లేచి పోయి నాడా! ఎవరికి తెలియని దేవు డొచ్చాడు. మనంచేస్తూవున్న మోసం దేశానికి హాని కరమని పెద్దలు కొందఱు ఆలోచించి మన సంఘమును వృద్ధి జేసుకునే నిమిత్తం హరిజనులను కూడా మనతో సమానంగా చూడ వలె నంటున్నారు. అలా కొన్ని దేవాలయాలలో ప్రవేశమిచ్చారు నేడో రేపో మనంకూడా మన దేవాలయాల్లోకి హరిజనులను రానియ్యాలిసిందే.

సూ:- ఇంతటి సౌరభ్యానికి మేము అర్చ కత్వం చేస్తేనేం చెయ్యకపోతేనేం. రేపటినుంచీ మాలవాళ్ళ తీర్థ ప్రసాదాలు పుచ్చుకునేగతి మీకు పట్టిందికాని, మాకేంలేదు.

ఇదుగో! యిప్పుడే నా అధ్యక్షత్వానికి రాజీనామా యిస్తున్నాను. నీయిష్టము వచ్చినట్లు ప్రాకేగుము. యీ కాంగ్రెసువారు చేసే బోధలు బాగా చెవికి యెక్కిన తర్వాత నామాట తెలపనికివస్తయ్. ఏమైతేనా కెందుకు. నేను వెళ్ళుచున్నాను. ఇదిగో! నీ సామాను దేవుణ్ణి ఆనక నిదానంగా వచ్చి వప్పగింత చేసుకో. నేను కాస్తా పోయిన తర్వాత. నీదేవునిగతి నీగతి యేమౌతుందో తెలిసివస్తుంది. ఏదో దేవునిలో సత్తువున్నా లేకపోయినా, యేమేమో మంత్రాలన్నీ గుండెలు మునిగేటట్లు ప్రతి రోజు యేకరువుపెట్టి. అలంకారాలు, ఆర్భాటాలు చేస్తాంటేనే ఇంత నిర్లక్ష్యంగా వుంది. ఏమీ లేకపోతే యేం పేలాలేగుతుందో నీకే తెలుస్తుంది. ఇప్పుడు నేను చెప్పిన ప్రయోజన మేముందో! ఏమైనా తగులబెట్టుకోండి నా దారిని నేను పోతున్నాను. ఈ రోజుతో ఈ దేవుడికి నాకు ఋణం తీరిపోయింది, (నిష్క్రమించును.)

ధర్మ:- ఎవరిమీద యీ విదిలింపు. అలిగి ఈయన నన్నేమి చేయగలడు! కోటాను కోట్ల మంది కూటికి లేనివాళ్ళున్నారు. యెవ్వరు దొరక్కపోతే అప్పుడే చూస్తాను. ఏదో లోకంలో మాటచెప్పితే యేమో అంతా మునిగిపోయినట్లు రాజీనామా పెట్టాలి యిందులకే పుట్టగతులుకూడా పోతున్నాయ్.

[నిష్క్రమించును.]

# చతుర్థాంకము.

## ప్రథమరంగము.

[హరిజనుడు ప్రవేశించును.]

హరి:-

శా॥ ఘోరా! యెంతటిక్రూరకాల మొదవెన్ యైశ్వర్యగర్వో
న్నతిన్ । గోరాకున్ గల పుణ్యకీర్తిగను లోకుల్ మమ్ము
ఛీద్రింపగా । నూరాడంగను నోరురాకనునుచో మాకర్మ
మిట్లుండెనా । లేరా మమ్ముల గష్టవార్ధిని జాలిన్ దేల్చు
పుణ్యాత్మకుల్.

మమ్ములనే యింత హీనముగ జూడనేల? అగ్రజాతులమని చెప్పకొనుచున్నవారికన్న మేమేమి కానిపనులు చేయుచున్నాము?

(ఒక సాహెబ్ ప్రవేశించి)

సా:-అరే! భాయీ! యిదీ యేంటోయ్. బిక్కముగం యేస్కొని యీడా కూకుండావ్. నీకే మనసు తిచ్చా లేదు?

హరి:-లేకేమి కాని నీవిప్పు డొచ్చుటికి ప్రయాణమైతివి?

సా:-అయ్యాగార్కి రైల్కెక్కించి యింటికి తిర్గి పోతుండాన్.

హరి:-ఆహా! యేమి యీకలిమాయ! మతాంతరులు సహితము దమ యిండ్లలో బ్రవేశించి సర్వకార్యముల జక్క

బెట్టుచుండ స్వమతస్థులమైన మాకు నీగతి యేల బట్ట వలయును ?

సా:- అరే భాయీ ! మామతాన్కి మీ మతాన్కి తేడావుం దీవోయ్. మాదీ మతంలో కూడా హాషారం వుందీవోయ్. మీకీ సాలాషాలా దేవుళ్ళుండార్. మాకీ హల్లా హొక్డే దేవు. యితర మతస్తుల్ మాదీ మతంలో చేరటాన్కి హీలూంలేద్. మాదీమతంలో అందర్కి పేర్చుకుంటామ్. హొక్కాతకాన్నె. హంతా షమానం.

హరి:- ఎవరి మతమును వారిట్లే గొప్పగా జెప్పుకొందురు. ఇందు గ్రొత్త యేమికలదు ?

సా:- హదీ కాదూవోయ్. మాదీమతంలో హొక్టె మాదిరి హాషారంవుందీ. మీదీషూస్తే ఒక్డు యెవవముండల్కి పెండ్లి షెయ్యావచ్చూహంటే హింకోడూ వద్దంటాడ్ మీలో రజస్రాలయ్న పిల్లల్కి పెళ్ళి షేస్తే తప్పా మొగో డ్కి పెళ్ళాంషస్తే యింకోదాన్కి షేస్కోవచ్చూనం రాద్. హింకా హింకా యెతికిషూస్తే హజార్లు హజార్లు ఘడాయ్.

హరి:- నీవు దెలియక యిట్లనుచున్నావేగాని, నిజముగ హిం దూమతముకన్న మరియొక మంచి మతములేదు. మా మతమునకు అహింసా సిద్ధాంతము ప్రాధాన్యమైనది. మీ మతములగాదు.

సా:- అరే ! షింసా సేసేవాడ్కి యేమీదోసమోయ్. సూసే

వాడ్కిగాని, ఇంతా యాదాంతం బలవటం శేషే నీబోటి నాళ్ళని దూర్ దూరంగా తరిమి యేస్తుండార్ ! మీాదీ దేముడ్కి. వుత్సవాల్ జరిగేటప్పుడు మాదీ మతస్థుల్ దొంజస్తుంబుదాకా రావొచ్చా నంటార్. మాలోళ్ళది హిందూమతం అయినా గుడికి కోశడుదూరంలో వుండా లంటార్. యేంమతమోంగ్మీాదీ. అంతా దొంగమతం.

హరి:-ఈ విషయమును మాత్రము ఒప్పుకోనక తప్పదు. యిదియంతయు మా పూర్వ జన్మ సుకృత విశేషమై యున్నది.

సా:-అరే భాయీా! మాదీమతం తీసోకని గడ్డం, మీాషం పెంచి నవాద్ షేస్తావుంటే హన్నాదమ్ముల్కన్నా హెక్కొవాగా హిందువుంత్తో తిగ్గావచ్చు.

హరి:-హరహరా ! యెట్టిమాటలు వినవలసివచ్చినది. స్వమతమునువీడి యన్యమతము నాశ్రయించుట యా! ఔను. యిం దాశ్చర్య మేమియుండును! యెందరెందర యెట్టి కష్టముల ననుభవింపజాలక నన్య మతముల నాశ్రయింప నున్నారోగదా. తుదకునీహిందూమతమున కిట్టిదైన్యము వాటిల్లినందులకు జింతిల్లవలశియున్నది.

సా:-అరే భాయీా! షింతించి ఫలం లేదు. నాదీమాటయిని మాదీమతం తీసోక, రేపటినుంచి, విందుల్కి, పెళ్ళిళ్లొకి వుత్సవాల్కి, ఉద్యోగాల్కి చదువుల్కీ యిన్నీ

యేంటి అన్నింట్కీ అంటుదోసం లేకుండా మాతోపాటు నిన్నూ కూడా షూస్తాం. తెల్సిందా!

హరి:- సోదరా! ఇంతమాత్రమున నే మావంటివారు స్వమత మునువీడి యన్యమతమున బ్రవేశింపరు. తెలిసినదా !

సా:- నల్లారాయీ అయినా కరుగుతుంది కానీ నీదీమనూ కర్రాదేమోయ్. అరే రాతికుండె మడ్సి హెంక్రుప్పుట్కాదోయ్. నీకూగా పారంపట్టి యేశ్శిస్తావుంటే హాల్లా యేమిచేస్తాడ్. నాకీ యీగొడ్వ అంతా యెందోకోయ్. ఇననోడ్కి చెప్తే క్యాఫాయిదా.

(నిష్క్రమించును.)

హరి:- యేదేని గొంచెము లోపముండిన బ్రతివాడు నిక్షే యనెదరు. హిందూమతమున నంటరానితనము హెచ్చిన కొలదియు క్షీణత్వము సంభవించుచున్నది. కానిమ్ము! యేమి కానున్నదో! నేను త్వరితముగ నేగి నామిత్రుడగు దేశదాసును కలసుకొందును.

(నిష్క్రమించును.)

---

ద్వి తీ య రం గ ము.

దేశదాసు ప్రవేశము.

దే:- ఆహా! కాలమెంత త్వరితముగ నడచుచున్నది! కావలసి నంత కార్యభారము నాశిరంబున గలదు. ఎట్లు సమర్థిం తునో తెలియకున్నది.

సీ॥ ఖద్దరు నూలును గలుగుదీలు వడుక
దేశంబులోన బోధింపవలయు
మత్తును జేకూర్చు మద్యపానము జేయ
గూడదంచును వాకొనగవలయు
బరదేశవస్తువుల్ మాని స్వదేశంపు
వస్తువుల్ గొనగ జెప్పంగవలయు
కులతత్త్వములమాన్పి కూడియుండంగను
దేశ సోదరుల బ్రార్థింపవలయు
తే॥ గీ॥ జీవహింసల బోనాడి చింతమాన్పి
వృత్తివిద్యలనంతట వృద్ధిజేసి
దేశదాస్యంబుబోయెడి తెలుగుజూపి
భారతావని సేవింపవలయు నేను.

అదిగో! నామిత్రుడిటకే వచ్చుచున్నాడు. ఈతని వలన గొన్ని విషయములు దెలసికొనవచ్చును.

[హరిజనుడు ప్రవేశించును.]

హరి:-దాసుగారూ! నమస్కారము.

దే:-మంచిది నాయనా! ఎటనుండి వచ్చుచుంటివి?

హరి:-ఇంటివద్దనుండియే. తమ దర్శనార్థము వచ్చుచుంటిని.

దే:-సరియే. నేడు మనము వకీలు శాస్త్రిగారితో మాట్లాడవలసియున్నదికదా?

హరి:-ఇంకనూ, వారికి యీ 'వకీలు' అను బిరుదమేల? ప్రాక్టీసు వదలుకొనిరికదా?

దే:_అగునుకాని, వాడుకరుద మగుటచే నట్లంటిని. సరియే, నేటి సమాచారము లేమైన గలవా?

హారి:_నేటి సమాచారము మీారు వినదగియే యున్నది.

దే:_ఎట్లు ?

హారి:_నే నొక చోకూఘస్తుని హిందువు లెల్లరు మావన్ముసులను దమతో జేరనివ్వక బెట్టుచున్న బాధలనుగూర్చి చింతించుచుండ నొక మహమ్మదీయ సోదరుడు వచ్చి నా దైన్యమును గాంచి తను మతములో నన్ను జేరవలసినదిగా గోరెను. నే నందులకు సమ్మతింప నైతిని. అందుల కాతడు మాటాడక వెడలిపోయెను.

దే:_సోదరా! భారతదేశమున నిన్ని మతములు పనికిరావనియు, మనమందరము నొకే మతము గలవారలమై యుండుటకు ప్రయత్నింపవలయుననియు, అటులగాకున్న హిందూ సంఘముగ కావికలై భేదభావము లేర్పడి ఐకమత్యముచెడి తుదకు నామరూపములనుగోల్పోవుననియు బోధింపలేకపోయితివా?

హారి:_ఏమో! నేనంతగ దెలుపనైతిని.

దే:_ఎంతటి తెలివిమాలిన పనిచేసితివోయీ! సరియే. గతించినదానికి వగచిన నేమి ఫలము కలదు! రమ్ము పోవుదము.

(నిష్క్రమింతురు.)

## తృతీయరంగము.

---

(స్వగృహమున, శాంతాదేవి రాట్నమునకు మంగళహారతి యిచ్చుచు ప్రవేశము.)

శాం:-ఓ పరమ పవిత్రమైన రాట్న లక్ష్మీ! నీ కృపలేని మానవజన్మము నిరర్థకముగదా! దయాంబురాశీ! భవదీయ కరుణారసము ననవరతము నాపై గురుపింపుతల్లీ! నీకివే ప్రణామములు.

(నమస్కరించును.)

[వకీలు శాస్త్రిగారు ప్రవేశింతురు.]

వకీ:-సతీ! పూజయంతయు ముగిసినదా!

శాం:-అగును. కొంచెము దారముకూడ వడుకవలసియున్నది.

వకీ:-యీ ఖద్దరు నూలును వడుకుటలో చాల శ్రద్ధవహించుచున్న నీ సుగుణము కొనియాడదగినదే.

శాం:-అగును. ఖద్దరుపైగల ప్రేమ యింకొక దానియందు నాకు లేదు. ఏలనందురా?

సీ॥ ఈ ఖద్దరేకదా యిండియాదేశంపు
దారిద్ర్యమునుబాపు తథ్యముగను

ఈ ఖద్దరేకదా యెంతో గౌరవ మొసగి
నాగరీకత వృద్ధిగాగ జేయు
ఈ ఖద్దరేకదా యెన్నొ సంఘంబుల
నేకంబుగా జేయు నెగిడుచుండు
ఈ ఖద్దరేకదా యెల్లవైరంబుల
మాన్పి శాంతముతోడ మెలగ జేయు

తే॥ గీ॥ గాన మనదేశవాసులు గౌరవముగ
నూలు వడకియు ఖద్దరు మేలుగాగ
దాల్చుచుండిన నెంతైన తరుగుగలదె
గాంధి యుద్దేశ్య మీరీతి గాదె నాథ.

వకీ:-సతీ! యెంత ప్రయత్నించినను నీవలె సన్నని నూలును కదురుపై దీయలేకున్నానే.

శాం:-సన్నమున కేమిగాని మీరు వడుకుచున్న దారము గొగ్గులు లేక పురిగలిగి యున్నది చూడుడు?

వకీ:-నీవు తయారుచేసిన నూలు నూతిము గొగ్గులు వారి పురిలేకయున్నదా? ఇదిగో! యీ వుత్తరీయమును నీవు వడకిన నూలుతోడ నేకదా నేయించుకొంటిని చూడుము. పాముకు బుసమువలె నెంత మృదువుగ నున్నదో!

శాం:-మీ మాటల కేమికాని, యీ యూరిలోని స్త్రీలందరు కలసి యొకచోట సాయంత్రము నాల్గు గంటలకు రాట్న లక్ష్మీపూజ లొనరింతురట నేనునూ పోయివత్తునా?

వకీ:-ఇందులకు నా యాజ్ఞయేల ? నిరభ్యంతరముగ పోయి రమ్ము. ఇంతకన్న మనకు గావలశినదేమి కలదు.

తే॥ గీ॥ కానరానట్టి దేవుళ్ళ కర్చనములు
చేయుఫలమేమి ప్రత్యక్ష శ్రీయనంగ
నొప్పి మానంబుగావగ నున్న రాట్న
లక్ష్మి నర్చించి సౌఖ్యములందవలయు.

దే:-సత్యము శాస్త్రిగారూ ! సత్యము ! మీరు వచించిన వాక్యము సత్యమే.

వకీ:-ఎవరావచ్చునది. (చూచి) దాసుగారా। దయచేయుడు'

దే:-శాస్త్రిగారూ। మనదేశమున దమవంటి త్యాగశీలురు కొలదిగనేయుండిరికదా! మిమ్ములను కేవలము దేశసేవకు లని చెప్పవచ్చును. ఏలనన!

మ॥ తగయుద్యోగముమానివేసి జగదోద్ధారంపు భావంబుతో
సుగమంబై యసమానమై సకలతేజోధాయియైయొప్పి యే
యగచాట్లన్‌బడనీక బ్రోచు సదుపాయంబైన సత్యాగ్రహం
బు గడించెన్ భవదీయమానసము నీపుణ్యంబదెప్పాటిదో.

వకీ:-ఇదియంతయును నాప్రయత్నకాదు. సర్వేశ్వర సన్నిభుండైన మహాత్ముని యాశీర్వచనా ప్రభావము. మరియును నాకులసతియగు నీపె సహాయఫలము.

దేశ:-నిజమేకావచ్చును. అందువలననే పురుషులకు స్త్రీ లర్ధాంగులని చెప్పుదురు. స్త్రీలకు స్వాతంత్ర్యము

యీాయరాదందురుకాని అదివట్టి పొరపాటు. శీలవంతు లైనవారికి స్వాతంత్ర్యమిచ్చినను భయములేదు. దుశ్శీల లగువారిని కట్టుబాటులలో నుంచినను లాభలేదు. కొందరు తెలియనివారు.

తే॥ గీ॥ పుస్తెగట్టినవెంటనే భువినిదమకు
లొంగి సేవింపవలెనంచు లో దలంచి
యెంతవిజ్ఞాన భూయిష్టకాంతనైన
బశువురీతిగజూతురు భర్తలిలను.

వకీ:-నామనంబున నేనట్లెన్నటికిని తలంపను.

శాంతా:-నిక్కవమేకాని లోకమంతయును నొకేతీరున నుండవలయునుగదా.

దేశ:-ప్రయత్నించినచో నంతయు నొకేవిధమున నడువకలదు.

శాంత:-ఇందులకు మనము చేయదగిన ప్రయత్నమేమి ?

దేశ:-అట్లైన సావధానముగ వినుడు. ఇల్లంత మనదేశమున గల స్త్రీలయొక్క దురలవాట్లను బారద్రోలి కర్తవ్యము బోధింపవలయును. ఎట్లన :

సీ॥ అపరిశుభ్రతద్రోచు నారోగ్యసూత్రముల్
అలవాటు జేయంగవలయునమ్మ !
నిత్య జీవనమందు సత్యదీక్షయుగల్గు
మార్గంబు బోధింపవలయునమ్మ !
పతియందు మిగిలిన బంధుజాలమునందు
వఱలుమార్గము జూపవలయునమ్మ !

ఆతిథ్యమునుగోరి యతిథు లేతేంగా
మెలగుకీతిని జెప్ప వలయునమ్మ!

తే॥ గీ॥ తొలుబాల్యనవేళల నారిలోని
యిరుగు పొరుగమ్మ లిండ్లకు నేగకుండ
నాలువడకెడి యలవాటు స్త్రీలలోన
వరుసగల్పింప బూనగా వలయునమ్మ!

వకీ:-సతీ! శాస్త్రిగారు చెప్పిన విషయములు వినియుంటివా?

శాం:-విన్ననూ. మీయాజ్ఞ కావలయునుకదా?

వకీ:-ఎన్నడైన నిట్టి విషయముల నిన్నాటంకి పెట్టితినా?

శాం:-ధన్యురాలను. దాసుగారూ! నేటినుండియు నా శక్తి కొలది నడుము గట్టుకొని వనితాలోకమునకు సేవజేయుదును.

దే:-మంచిది. పుణ్యదంపతులారా! రేపటిదినమున మన తాలూకా కాంగ్రెసు భవనమునందు శ్రీ మహాత్మా గాంధిగారి జయంతి యుత్సవము జరుగుననియు, అందులకు మెల్లరును విచ్చేయవలయుననియు కార్యక్రమ సూచనలతో ఆహ్వాన పత్రికలు పంపిరి. గాన మీరును వచ్చుటికి దయచేయుడు. నేను పోయివచ్చెదను.

వకీ:-సరియే! దయచేయుడు.

[నిష్క్రమించును.]

# పంచమాంకము.

## ప్రథమరంగము.

[వాలంటీర్లు కొందరు జెండాలతో కీర్తనలను పాడుకొనుచు ప్రవేశింతురు.]

1. వా:-ఓ భారతసోదరులారా! దేశస్వాతంత్ర్యమునకై ఆత్మార్పణముగ మీ సర్వస్వములను ధారపోయ నేడే పూనుకొనుడు. యీనాడు మన తాలూకా కాంగ్రెసు భవనమున జరుగనున్న మహాత్ముని జయంత్యుత్సవము కన్నుల పండువగనేగాక దాస్యశృంఖలములను ద్రెంపి స్వాతంత్ర్యమును బొందునట్టి మహాత్ముని సమస్యలను గూర్చి విపులముగ తెలియజేయును. ఇట్టి అవకాశము కలుగుచున్నందులకు భగవంతుని వేనోళ్ళ కొనియాడి భజింపదగియున్నది. ఇంకను వివిధ భావములతో పరస్పర వైరములు గల్పించుకొని దెబ్బలాడుకొనుచు పూజ్యమైన కాంగ్రెసు తత్త్వమును యేల పాడుచేసెదరు? రండు తడవుచేయక రండు. మనకు నుపకారముగల్గు మంచి తరుణమిదియే గాన,

మ॥ సహింపంగనురానిదుస్థితుల నీ సందర్భమందెల్లరున్
నిహతంబొప్పగ జేయగాదగిన వెన్నేసూత్రముల్ నేర్వగా
బహుయోగ్యంబుగ నుండునావునను సద్భావంబుతో

గాండీయున్ । శహబాసంచును లోకముల్ పొగడగా
జై జైలతో రంజికన్.

అందరు:- జై! మహాత్మా గాంధీకి జై! (నిష్క్రమింతురు)

వకీలు శాస్త్రీయును, శాంతాదేవియును (కీర్తనతో) ప్రవేశము.

శాం:—ఓ భారత సోదరీమణులారా! అపర కృష్ణావతారుడై ఆసేతు హిమాచలపర్యంతము తన పునీత భావములను వెదజల్లి దేశకళ్యాణమునకు తన సర్వస్వము ధారవోయు చున్న మహాత్ముని జయంత్యుత్సవము కన్నులపండువుగ జరుగుచున్నది. ఇట్టి అపూర్వసందర్భమును నేడు మీ రెల్లరునువచ్చి గాంచుడు. అనేక దురలవాట్లకులోనై అజ్ఞానపూరితమై అధోగతిపాలుగానున్న మీ యంత రాత్మలను పునీతములుగ జేసుకొని భారతలక్ష్మియొక్క సౌభాగ్యమును సర్వవిధముల గాపాడుటకు పూను కొనుడు. పురుషులకుతోడు మీరును మీ దేశమాతకు సేవజేయవలసిన బాధ్యత మీయందు సంపూర్ణముగ గలదు. గావున మీరెల్లరును వెంటనే బయలుదేరి యీ మహోత్సవస్థానమును జేరుకొనుడు.

సీ॥ ధర్మంపునిలయమై ధారుణీరత్నమై
యేభూమివిలసిల్లె నింతవనుక
త్రిపథగామిన్యాది దివ్యవాహినులెల్ల
యేభూమి ప్రవహించె నింపుగాను

వేదాలు శాస్త్రముల్ విలసిల్లి పెంపొంద
యేభూమి యాడగా నెసగియుం
సాధ్వీమతల్లుల సౌఖ్యంబు గాపాడ
నేభూమి మాతగా నెగడియుం

తే॥ అట్టి మహనీయగుణముల పుట్టినిల్లు
యైన భారతమాత హేయంబునైన
దాస్యవృత్తికి నేర్పడె దయనుమాలి
జూచి యెటులుందురో యింక సుదతులారా !

(ప్రవేశము-ఇద్దరు విధవా స్త్రీలు.)

1. వి:-ఒసేవ్, భవానీ! ఇలా రావే కొందఱగా. చూస్తుగాని.

2. వి:-అదేమిటే! అంతా ఒక్క రకంగా వున్నారే! ఆడం డాలు, అట్టహాసం యెక్కడ సంపాదించారూ అంట?

1. వి:-చక్కని పాటలు పాడుకుంటూ మన వాకిట్లోంచే వెళ్ళారు. ఎన్ని పిలిచినా ఇంట్లోనించి కదిలి రానే రావాయే.

2. వి:-నువ్వంటే యెక్కడికిబడితే అక్కడికి గబగబా పరు గెత్తుతావమ్మా! కుంటిముండను నీతో యెలావస్తానూ?

1. వి:-నేనుమాత్రం యెక్కడికి వెళ్ళుతున్నానే. మొన్న శివా లయంలో స్వాములవారు ఉపన్యాస మిస్తున్నారంటే వెళ్ళాను. ఎప్పుడైన యే మహానుభావుడైనవచ్చి హరి కధ చెపుతుంటే విందామని వెళ్ళటమేకాని, యేంలాభం

ఆ నిద్దరపెద్దమ్మాన్ను వినని స్తేగా కూర్చున్నదగ్గర నుంచీ ఒకటే కునికిపాట్లు.

2. వి:-ఆనక విన్నా, వినకపోయినా యింటోనుంచి బయలు దేరుతూ వుంటావు. నాకా అదృష్ట మెక్కడిది?

1. వి:-నీకుమాత్రం యేంకష్టమొచ్చిందే పిచ్చిదానా?

2. వి:-నీకేం చెపుతావు మాటలు. పెనిమిటి బ్రతికేవున్నవాళ్లు బజారుమొగంచూడకుండా అలా కాల్చుకుతిన్నాడు. ఇక యిప్పుడాంటే ఇహనడిగేవారు లేక వెకవెకలూ పకపకలు.

1. వి: నువ్వు యెట్లావుంటే వాళ్ళ సొమ్మేంపోయిందో?

2. వి:-యేమో అంతా యిళ్ళల్లోవుండి పతివ్రతాత్వం భగ్గున వెలిగించుతున్నట్లు యెదుట వాళ్ళను చూస్తే హేళన. యెక్కడికిపడితే అక్కడికి టెంకాయలు ముందు తయారవుతయ్యని కాస్త లేనవాళ్ళకు అలాగునే.

1. వి:-ఏ సౌఖ్యాలు లేకపోగా ఇంత పుణ్యం, పాపం అంటూనైనా వుండకూడదు? ఎవరేల్లిపోతే వీళ్ల సొమ్మేంపోయింది? అట్టే ఇలాంటిమాటలు వింటూవుంటే వళ్లు మండిపోతుంది.

2. వి:- యిందుకనే మనబాధలు విచారించి ద్వితీయ వివాహము చేసుకోండర్రా అని నెత్తిన నోరేట్టుకొని కొందరు మహానుభావులు అరుస్తూవుంటే ఇంకా మనవాళ్లు పూర్వాచారం అంటూ వెనుక్కు చస్తున్నారు. మనమాట

యెలావున్నా, పగవాళ్లయినా యీవిధవతనం అనుభవిం
చరాదమ్మా! మనంకూడా వీళ్లైతే లోకానికి వెరవ
కూడదమ్మా!

1. వి:-చాల్లే యికవూరుకో ఆతెలివి యిదివరలోనేవుంటే
బాగావుండేది. యిన్నేళ్ళువచ్చిన నిన్నూ, నన్నూ ఎవరు
పెళ్ళిచేసుకుంటారే గతిమాలినవాళ్ళు. ఇక నోరుమూసు
కొని యింట్లోకిపద. యెవరన్నావింటే నవ్విపోతారు.

2. వి:-అమ్మగో యింట్లో యేమిటో చప్పుడవుతూంది.
(నిష్క్రమించును.)

1. వి:-అన్నపుతప్పాలామీదమూత పడదోసినట్టున్నయ్. వీటి
కొంప తెగపిల్లులు ప్రాణాలు తీస్తున్నయ్—
(నిష్క్రమించును.)

చ తు ర ర ం గ ము.

కాంగ్రెసుభవనమున-కాంగ్రెసునాయకులెల్లరు

[ ప్ర వే శ ము. ]

(గాంధిమహాత్ముని పటమును పూజించుచూ)

1. వా:-

ఉ॥ శ్రీమహనీయసర్వజనశ్రేయ యుదారభావ నీ। వే మము.
బ్రోవగాదగిన వేల్పువటంచును యాత్మలందుబల్ । నీమ
ముతోడగొల్చు మము నేమని యెంతువొ గాంధిదేవ, మే
మేమియుగోరబోము ప్రణమిల్లగ నీపదమొందు దక్కగన్

యీ సభకు అధ్యక్షత వహింప శ్రీయుత దాసుగారి నిన్ని, ఉపాధ్యక్షతకు శ్రీమతి శాంతాదేవిగారిని ప్రార్థించుచున్నాను. [అధ్యక్షులకు పుష్పమాలలు వేయుదురు.]

అందఱు:- [కరతాళధ్వనులు చేయుదురు.]

దే:- ఈ కార్యక్రమములో మొట్టమొదట అధ్యక్షుని తొలి పలుకులు అనియున్నది. గనుక రెండు మాటలతో ముగించెదను.

నేడు గాంధిమహాత్ముని జన్మదినమగుటచే సుదినము. ఆమహాత్ముని గుణవర్తనములను గురించి ముచ్చటించుకొనుటయే మన కర్తవ్యాంశమైయున్నది. ఇందును గురించి యెవ్వరైన నుపన్యసింపవచ్చును.

[కూర్చుండును.]

రాం:- అధ్యక్షా! సోదర సోదరీమణులారా! మనమెల్లరము భారత సంతానమైయున్నాము. ఇప్పుడు మనము పూజించిన గాంధీమహాత్ముడును భారతావనికి జన్మించినవాడే. సోదరవాత్సల్యముచే ప్రస్తుతము మనల నావరించిన యిక్కట్టులనుండి యుద్ధరింపబూని తన సద్గుణములను వెల్లడిచేసియున్నాడు. కావున మనకెల్లరకు వందనీయుడు. యీ మహాత్మునిచరితము మనకెల్లరకును విశదమే. కాన జెప్పనవసరము లేదు. గాని, ఈ మహాత్ముడు మనకు నిరంతర ముపదేశించుచున్న శాంతిసూత్రములను మరువక వర్తింతుముగాకయని నే ప్రార్థించుచూ నాయుపన్యా

సమును ముగించుచున్నాను. (కరతాళధ్వనులు)

వక్:-మహాశయా! సోదరులారా! ఉపన్యాసములవలన ప్రయోజనము లేదనియు, క్రియారూపమున మనయొక్క సామర్థ్యమును జూపవలయుననియు నేను నుడువు చున్నాను. మన మహాత్ముని యాజ్ఞానుసారము వర్తించుటలో యెట్టి స్వల్పమైన భేదభావములు లేక యైకమత్యముతో నుండినగాని ఫలముచేకూరదని మనవిచేయుచు యింతటితో విరమించుచున్నాను. (కరతాళధ్వనులు)

2. వా:-ఆర్యమహాశయా! సోదరులారా! మహాత్ముని యాదేశమును గుర్తించి, వర్తించుటలో మనయందొక పెద్ద లోపము గన్పట్టుచున్నది. యేమందురేని, వినుడు దేశసేవచేయుటలో స్త్రీ పురుషభేదములు లేక యెల్లరును ప్రోత్సహింపవలెను. అటుల జేయజాలనియెడల మన కార్యము ఫలవంతము కాజాలదని నానమ్మకమును వెలిబుచ్చుచు ఇంతటితో ముగించుచున్నాను.

జయశర్మ:-మహాశయులారా! యెల్లరును మంచిసేవకులుగ జేయవలెనన్న ప్రస్తుతము మనలోనున్న దురలవాట్లను, దురభిప్రాయములను, దుర్వృత్తులను పూర్తిగా నశింప జేసుకొనవలయును. ఇందు మనము జేయవలసినకృషి యనంతము కనుక యెల్లరును దీక్షవహించి సర్వజన శ్రేయముకొఱకు పాటుపడగలరని నమ్ముచూ యింతటితో విరమించుచున్నాను.

హరి:-ఆర్యా! సోదరభారతీయులారా! పల్లెటిగ్రామవాసులు యేమియు తెలియనివారు: వారిని అన్నివిషయముల బాగుచేయ వలయును. వారు లేకున్న మనపని సున్నయగును, గనుక తామెల్లరును దీక్షవహించి గ్రామములను పునరుద్ధరింతురుగాక యని ప్రార్థించుచూ నా యుపన్యాసమును ముగించుచున్నాను.

శాం:-అధ్యక్షా! సోదర ప్రేక్షకులారా! నేను ముఖ్యముగ భారత సోదరీమణులను గూర్చి కొలది మాటలు చెప్పదలచితిని. అన్నివిషయముల లోను భారతదేశపు స్త్రీలు వెనుకబడియున్నారు. దేశము చాలా క్లిష్ట సమస్యలలో మునింగి తేలుచున్నది. యిట్టియెడ మనము కూపస్థ మండూకములవలె నుండిన యనేకకష్టములు సంభవించు ననుట నిస్సందేహము. యెల్లరును రాట్నమువడికి ఖద్దరు తయారుచేయ వలయును. పురుషులతోపాటు పదుము కట్టుకొని దేశసేవ జేయగడంగ వలయును ఘోషాపద్ధతులికపనికిరావు. మంచిశీలముకలిగి, యేప్రయత్నము చేసినను మనగౌరవములకు హానికలుగదు. గాన సోదరీమణులారా! భారతగృహలక్ష్మీసమానులైన మీరు సర్వదా సన్మార్గ వర్తనులై లోకకల్యాణము చేకూర్చెదరుగాక యని ప్రార్థించుచున్నాను. (కరతాళధ్వనులు.)

అధ్య:-తరువాత గ్రంథాలయము స్థాపించుట. ఇందులకు శ్రీ వకీలుశాస్త్రిగారు ప్రారంభకులగుదురు.

వకీ:- గ్రంథాలయమును స్థాపించుటకు ముందు మీకు గొన్ని విషయములు చెప్పవలసియున్నది. మన దేశములో నిర క్షరాస్యత సంపూర్ణముగా నిండియున్నది. దీనిని నివారిం చుటకు గ్రంథాలయములు ముఖ్యసాధనములు. గ్రంథా లయమును స్థాపించుటతోడనే తృప్తిజెందక విద్యయందు వెనుకబడిన స్త్రీపురుషులకడకుబోయి మంచి పుస్తకముల నిచ్చి వారిచే జదివించవలెను. ఇందులకు విద్యాధికులై నిరుద్యోగులై యున్న యువకులు పూనుకొనవలయును. మఱియు గ్రంథాలయమునకు ముఖ్యమైన పత్రికలను తెప్పించుకొనుచు అందలివిషయములను చదివి గ్రహించి హరిజనవాడలలోను పల్లెటి గ్రామములలోనుగల విద్యా శూన్యులను రప్పించి వారికి దేశవార్తలను బోధించవల యును. యీగ్రంథాలయములు యెల్లచోట్ల స్థాపించుటకు దగిన యేర్పాటులుగావించి దేశసేవ జేయగలందులకు కోరుచూ ఈగ్రంథాలయ ప్రారంభోత్సవము జరుపు చున్నాను.

(ఒక బీరువాలో పుస్తకము నుంచును. కరతాళధ్వనులు)

అధ్యక్షోపన్యాసము.

సోదర సోదరీమణులారా! నేడు గాంధిగారి జన్మ దినోత్సవ మగుటచే మన మందర మిచ్చట చేరి యున్నాము. ఇటువంటి జన్మదినోత్సవములలో నలుగురు చేరి టీపార్టీలు, విందులు జరిపి నాలుగు యుపన్యాసము

లతో సభముగించి యెవరి యిండ్లకు వారు బోవుటకాదు. ఎవరిని యీనాడు మనసుందరము గొలిచితిమో వారి గుణగణాదులను స్మరించుచూ వారి యాశయముల నెరవేర్పుటకు బద్ధకంకణులము గావలయును. అప్పుడే ఈజన్మదినోత్సవమువలన లాభము. అప్పుడే వుపన్యసించిన ప్రయోజనము. ప్రస్తుతము దేశములో అనేక యనర్థకములు, క్లిష్ట సమస్యలు వ్యాపించి యున్నవి. స్త్రీలలోనుండు దురాచారములను, వాటిని తొలగించు యుపాయములును శ్రీమతి శాంతాదేవిగారు యిప్పుడే చెప్పియున్నారు. తరువాత గ్రంథాలయముల వలన గలుగు లాభములను శ్రీయుత వకీలుశాస్త్రిగారు చక్కగా వివరించారు. తరువాత మనవారు హరిజనులను అనాదినుంచి అర్థములేకుండా అంటరాదని జెప్పియున్నారు అసలు జాతివిభజనలో చతుర్వర్ణములేగాని పంచమజాతి యనునది లేదు. వేదములలోగూడాయున్నట్లుతోచదు. అస్పృశ్యతయనునది కొన్నికొన్ని కార్యములవలన జనించుచున్నది మనతోడి మానవులును, మన మతములోనివారును మనవాళ్ళచే నానాబాధలు పెట్టబడేవారును అయిన అంటరానివాళ్ళను ఉద్ధరించి విశ్వమానవకళ్యాణమునకై పాటుపడవలయును. అస్పృశ్యతవలన దేశమునకు, మతమునకు, గూడ నష్టములున్నవి. ఇంటిగుట్టు లంకకుచేటన్నట్లు మనలోమనకు నీభేదములున్న దాస్యమును తొలగించుకొనజాలము. ఇక మనమతమునకు పరమతస్థుని గౌర

వించి స్వమతస్థుని నీచపరచుట యెంత హేయమెూ ఆలో చించండి. పరమతస్థులు అనేకములైన ఆశలు వీరికి చూపించి వాళ్ల మతములోనికి ఆహ్వానము చేస్తు న్నారు. యెవ్వరైనను అట్టి స్థితులలో ఆ యాశ లను ఆశించుటకు ఆశ్చర్య మ్కుందునా ? ఇది యంతయు దీని ఫలితము. ఇందువలన మన మతము క్షీణించుచున్నది. కనుక సోదరులారా ! మతమునకు దేశమునకు, మానవ మాత్రునకు కూడా వినాశకారణ మగుచున్న యీ అస్పృశ్యతను తొలగించుటకు నడు ములు కట్టండి. యీ యుద్యమము సాగించుచున్న గాంధి మహాత్మునికి చేయూత లివ్వండి. వారు, మనము అంద రము ఏకగ్రీవముగ దేశదాస్య విమోచనకు ప్రయత్నము చేయుదము. రాట్నము వడకండి. ఖద్దరు కట్టండి. విదేశ వస్తువులను బహిష్కరించండి. మత్తుపదార్థములను, జీవ హింసలను మానివేయండి. మన మీనాడు ఏ మహాను భావుని పూజించుటకు సమావేశమైతిమెూ అమ్మహాత్ముని సిద్ధాంతములను, పద్ధతులను మన మందరము ఆచరించు టయే ఇట్టి యుత్సవములకు నాదర్శము. వాటిని ఆచ రించు కాంగ్రెసువారికి సహాయము చెయ్యండి. [గాంధి మహాత్మునకు జై !] తరువాత స్వమతస్థులతో బాధపడు హరిజనజాతివలెనే ఇంకొకజాతి యున్నది. అది ధనవం తులచే, జమీందారులచే బాధింపబడి కృంగి కృశించు చున్న కార్మికకర్షకజాతి. మానవత్వాన్ని జ్ఞాపకము చేసు

కోని, దాన్నికూడా యుద్ధరించాలి. యిప్పటికే చాల కాలాతీతమైనది. దీనిని గురించి యింకా చెప్పకోన వచ్చును. నేను వయస్సునందు మీకంటె మిగిలి యున్నాను. ఇకముందు అంతగా శ్రమచేయలేను. ఇక ముందు నవానవ్యక్తిని గనిపెదను. నా వాక్యములయందు మీరెల్లరు నమ్మియుంచి దేశసేవా పరతంత్రులై విశ్వ మానవ కళ్యాణమునకు దోహదమునరు గాక యని ప్రార్థించుచున్నాను. ఇట్టి యుత్సవమును జరిపిన వారలందరికిన్ని, ఉపన్యసించినట్టి శ్రీయుతులు వకీలు శాస్త్రి, శాంతాదేవి గార్లకున్నూ, విన్నందుకు మీకున్ను నన్ను అధ్యక్షపదవికి గోరిన మిత్రులకు నా ధన్యవాదములు అర్పించుచూ, సభ ముగించుచున్నాను.

[కరతాళధ్వనులు.]

ఇంక మనమందరము నొక్కమారు భరతమాతను తలంచి మనయుద్దేశ్యమును వెలిబుచ్చుదము.

భరతవాక్యము.

తే॥ గీ॥ సర్వసుఖ సాంప్రదాయియై జగతి నుతుల
గొన్న భారతమాతను జిన్నబుచ్చు
దుష్ట యాచారముల్బాసి శిష్టులౌచు
యెల్ల సోదరులుండుత నింపుమీరు.

సంపూర్ణము.

# తప్పొప్పుల పట్టిక.

| పేజీ. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 2 | 22 | సృష్ఠించి | సృష్టించి |
| 13 | 16 | స్త్రీల పురుషులగుండ | స్త్రీలు బూరుషులెల్ల |
| 25 | 5 | కమనీయ | చెన్నైన |
| 25 | 9 | గాలివీవగనలుసు | గాలివీవనలుసు |
| 28 | 7 | దేవుడొసగిన | దేవుడిచ్చిన |
| 32 | 12 | నెగ్గిన | దొరకొను |
| 38 | 4 | మరియొక | మరియొక |
| 41 | 3 | నచ్చిననేకదా | వచ్చిననేకదా |
| 43 | | ద్వితీయాంకము | తృతీయాంకము |
| 44 | 21 | యింకొచోట | యింకోచోట |
| 55 | 17 | ప్రయత్నకాదు | ప్రయత్నముకాదు |
| 58 | 17 | సహింపంగను | సహాయింపంగను |



